# రసికజనమనోరంజనము.



ఇది

ప్రస్తుతము

జమహేంద్రవరము దొరతనమువారి కాలేజిలో

తెలుఁగుపండితుఁడుగానున్న

కందుకూరి - వీరేశలింగముచేత

రచియింపఁబడినది.



మొదటికూర్పు



రాజమహేంద్రవరము:

శ్రీవివేకవర్ధనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

౧౮౮౫.

దీనివెల ౪ అణాలు.

# పీ ఠి క.



నమనోరంజనమనియెడి యీశుద్ధాంధ్ర ప్రబంధమిప్పటికి పదియేను దట నాచేరచియింపఁబడినది. దీనిని మొట్టమొదట మిశ్రకావ్యము నను, మిశ్రకవిత్వమునం దిటువంటి ప్రబంధములనేకము లిదివఁ ండుటను, శుద్ధాంధ్రమునం దిటువంటి ప్రబంధము లేవియు లేకపో నచ్చతెలుఁగున వ్రాయుట యుచితమనియెంచి మిశ్రకావ్యమున బంధములోని కథనే పుచ్చుకొని తెనిఁగింపఁదగినంతవఱకు దానిఁ ను వర్ణనలను గ్రహించి కొన్నిటిని క్రొత్తగాఁ జేర్చి యీగ్రంథము యందులో నితరప్రబంధములలోని పద్యములను బోలిన పద్యములు కొ టువంటివాని నచ్చతెనుఁగులోఁ దెచ్చుటయందలి కష్టమును విచారి ను నన్ను మన్నింతురని విన్నవించుచున్నాను. ఈగ్రంథములోని కొ వ సంవత్సరారంభమున బందరుపురమునందుఁ బ్రకటింపఁబడుచు వదాయనియందుఁ బ్రచురింపఁబడినది అటుపిమ్మట మనభాషయం ల లోపమునుతలఁచి వచనపుస్తకములను రచించుట లోకోపకారః వ్యముల నుపేక్షించి వచనకావ్యములను వ్రాయ నారంభించితిని.

దీనితరువాత నారంభింపఁబడిన శుద్ధాంధ్రోత్తరరామాయణము చియున్నది. ఈప్రబంధమును సహితము నేనొకమాఱువైచి యుంచె, నినిగాని కొన్నిమాసములక్రిందట మఱియొక పుస్తకము నిమిత్తము ప్రాతకాగితములలో దీని చిత్తుపుస్తకము దొరకినది. దానిని చ ని ప్రకటించుట కొందఱికి సంతోషకరముగా నుండవచ్చునని తో దింపించినాను. ఈపుస్తకము యొక్క చివరభాగమునందు నాచిత్తు న్నిపద్యములు పోయియున్నందున, సందర్భశుద్ధి తెలియుటకయి కొ క్రొత్తగా రచించి యక్కడఁ జేర్చియున్నాను. దీని శైలినిగూర్చిఁ ను గూర్చియు దీనింజదివెడివారే విమర్శింప నర్హులుగనుక నేనావిషయ డ నేమియు వ్రాయక విరమించుచున్నాను.

నవరము. }
రా౫ సం॥ }

కందుకూరి - వీరేశలింగము.

# రసికజనమనోరంజనము.

## ప్రథమాశ్వాసము

చ॥ సిరివిరిబోఁడిఁగూడి యొకచేతను నాతుకచేతులూఁతగా। గరుడిని నెక్కి నక్కలికి కమ్మనికేల్జడ సంచుఁగాంచి యగ్గరుడియు నల్లత్రాఁచనుచు గ్రక్కున ముక్కున నొక్కనిక్కఁ దాఁ జురచురఁ జూచి కేలుఁగవఁ జక్కనదల్చెడు వెన్నునెన్నెదన్॥ ౧॥ సీ॥ పక్కిగుఱ్ఱపురౌతుఁ బక్కిగుఱ్ఱపురౌతు దాయయుఁ గొడుకునై తళుకుగులుక। కొండకానుపుఁ బ్రోడ కొండకానుపుఁ బ్రోడ బావయునాలునై బలసి వెలుఁగ। కడలిపుట్టువయును గడలిపుట్టువయును మేతయునగయునై మెఱపునెఱప। కందునితండ్రియుఁ గందునితండ్రియుఁ దూపునుగన్నునై యేపుచూప। సత్తిజవరాలు కూళలమొత్తు కేలు। హత్తితోలిన దోరంపుమిత్తిఁదోలు। క్రొత్తనాలును నల్లనికుత్తుకయును। గలుగు గిత్తతత్తడిరౌతుఁ గొలుతు నెపుడు॥ ౨॥ చ॥ పలుకులచాన వేనలిని బాఱఁగనుంగొని నల్లమబ్బుగాఁ। దలఁచి కలంగి పాఱఁ జనుదానిని జెల్వుపుటంచఁ గాంచి నేర్పలవడఁ జేయి భామరల నల్లన చేరఁగఁ బిల్చెడు పువ్వనన్నలువ యొసంగుఁ గాత విడనాడక నాకుఁ గడిందిక్రొంకల్॥ ౩॥ క॥ గొబ్బెరకాయల మెక్కుచు। నిబ్బరముగఁ గొల్చువారి నెఱిఁ బ్రోచెడియా। గిబ్బవజీరు కొమారుఁడు। గొబ్బున నొడఁగూర్చుఁగాతఁ గోరికలెలమిన్॥ ౪॥ చ॥ కలుములచేడె కోడలు నిగారపుఁ దెల్లనిమేని చాన ప్రల్కులసిరి కాటపట్టు బలుకోరికఁ బెన్మిటిమోము దమ్ములం। దలరెడు కొమ్మ సోయగపు టంచపయిన్నడయాడు చామ యొనలువ వెలందినిచ్చలును నాలుకఁగాపురముండుఁగావుతన్॥ ౫॥ వ॥ అని వేల్పులనెల్లం గొనియాడి॥ ౬॥ గీ॥ నన్నయఁ దలంచి తిక్కననెన్ని పిదప। నెఱ్ఱప్రగ్గడఁ గొనియాడి యెల్ల తెలుఁగు కబ్బపుం గూర్పరుల మదిఁ గారవించి। యొక్కటను బెద్దలకు నెల్ల మ్రొక్కులిడుదు॥ ౭॥ గీ॥ నిందు నెమ్మేను విడనాడి పుంఢులకును। నిక్కనీఁగలవగమాని నీరువిడిచి। పాలుగొను నంచ తెఱఁగూని వఱలుమీరు। తప్పులఁదొఱంగి నెనరుంచి యొప్పుగొనుఁడు॥ ౮॥ వ॥ ఇట్లు వేల్పులం దొల్లిఁటి తెనుంగు కబ్బంపుఁ గూర్పరుల న్వేర్వేరఁ బేర్కొని నానేర్చుకొలంది నొక్క యబ్బురంపుఁ దెలుంగు కబ్బంబొనగూర్పఁ దలంచి మొదల నాకొలంబు తెఱంగించుక వక్కాణించెద॥ ౯॥
సీ॥ జగములఁగలిగింప నెగడింపఁ బొలియింపఁగల వెన్నుఁడే వేల్పుకన్నతండ్రి। యులమి నెల్లరకును గలుములు కలిగించు సిరిచెలియే వేల్పు చెలఁగుతల్లి। చెలరేఁగియుండఱ వఱపించి నుగ్గిక్కించు ననవిల్తుఁడే వేల్పునను గుఁదోడు। చదువులకెల్లను గుదురగుచు వెలుంగు వెలిచానయే వేల్పు వెలఁదిమిన్న। యట్టినలువ వంగడమున నమరఁ బుట్టి। రాజలింగమనంగను రహిఁదనర్చి। యశఁము బేసికన్నులవేల్పు నందుఁగలుగ। బత్తికలి

మిని సరిలేక వన్నెమీఱె॥ ౧౦॥ గీ॥ ఊళ్లఁబల్లెలు నేలుచు నుండియాతఁ । డెల్లనా
రలఁ దనుపుచు నీగిచేత। వాసిగని కాంచెను గొలంబువన్నెకెక్కఁ । జంద్రమౌళియను
కొమారు సాటిమీఱ॥ ౧౧॥ క॥ అక్కమయను నెలనాగన్ । మక్కువతోఁ బెండ్లి
యాడె మఱియాతఁడు మున్ । ముక్కంటి గట్టుకన్నియ। నక్కఱతోఁ దాను బెం
డ్లియాడిన కరణిన్ ॥౧౨॥ క॥ వీరేశలింగమను కొడు।కారయఁగాఁ జంద్రమౌళి కరు
దుగఁబుట్టెన్। జేరియును పాలకడలికి। గారాబపుఁజందురుండు కలిగినమాడ్కిన్ ॥౧౩॥
ఉ॥ ఆతఁడు విద్దెలం గరము నందఱచేతను మెప్పుపొంది మే।ల్సేతల నెందునున్నవతు
లేకచెలంగి కరంబుమేటియై। బ్రాతిగ నేలతోండ్లకడఁ బ్రగ్గడయై కడుఁబేరుపొంది తా।
నేతఱి మేటిదేవరనె యెంచుచు లింగనిమానెఁ గొల్వఁగన్॥ ౧౪॥ గీ॥ కొమరులను
గాంచె నాకందుకూరి కొలఁపుఁ।బెద్ద వేంకటరత్నమన్ పెద్దకొడుకు । వెనుకఁ జిన్ని
సుబ్రహ్మణ్యమను కొమారు। నలరుతనచానయైన కామమ్మయందు॥ ౧౫॥ క॥ అందుల
సుబ్రహ్మణ్యుఁడు। పొందుగ నెల్లరును దన్నుఁబొగడఁగసిరులన్ । జెంది వెలిఁగెఁ దన
సరివా।రందఱిలో మిగుల నన్నయానకులోనై॥ ౧౬॥ గీ॥ మున్నుకడలి రాకన్నియఁ
జెన్నుమీఱ । వలచి వెన్నుండునైకొన్న చెలువుదోపఁ । బున్నమయనంగఁ దనరారు
పొలఁతిమిన్న । నబ్బురంబుగఁ బెండిలియాడెనతఁడు॥ ౧౭॥ క॥ అయ్యెరువురకును
సంతస। మొయ్యనఁజేకూఱ నేను నుదవితిమదిలో। నెయ్యమునన్నిలుపుడుమరు।నయ్య
ను వీరేశలింగ మనఁజనుచుందున్॥ ౧౮ ॥ సీ॥ ఏమేటియడుగుఁ బొండామరల్ తొలి
వేల్పు మొదలగువారలుపొందఁజాల । రేవేలుపులవేల్పు నెదయందుఁబాయక కలు
ములకొమ్మ నిచ్చలుసునుండు । నేదిట్టబొజ్జలో నెల్లజగంబులు నొకమూలఁ బొందుగా
నొదిగియుండు । నేపెనుదంటపేళ్ళైదురపుటోరెంపుఁదపసిలోనగువారుతలఁతురెపుడు।
నట్టివెన్నుండు కనికరముట్టిపడఁగ । నాదుడెందంపుఁ దమ్మిలోఁ బాదుకొలిపె । నాదు
కబ్బంబుఁ దనకప్పనంబు సేయు । తలఁపు పెఱవేలుపుల నేరిఁ దఱియకుండ॥ ౧౯॥
క॥ అట్టి కనికరపుగనికిన్ । గట్టిగ వేలుపులనెల్లఁ గాచుచుమదిలోఁ। బుట్టినకినుకన్
రక్కసి । జెట్టులఁదునుమాడుసిరుల చేడెమగనికిన్ ॥ ౧౯॥ క॥ నెట్టనగొల్లపడంతుల।
బట్టలుదొంగిలిన చుట్టువాల్దాల్పునకున్ । బొట్టెలఁ జంపఁగడంగిన। కట్టిఁడిముద్దియఁ
దునిమిన కఱివేల్పునకున్॥ ౨౦॥ క॥ క్రాలెడునాలున్ బంగరు । సాలున్నెఱచుట్టు
వాలుఁ జాలఁగనలుపొ । డాలుం బాలకడలి నడి।ప్రోలున్ సరిమాలు మేలుఁబొసఁ
గెడు దొరకున్॥ ౨౧॥ క॥ మేటికసిరియొద తామర।తేఁటికి గరువంపుఁ బొలు
సుదిండులదళవుం । గాటపుఁ దెమ్మెరనెచ్చెలి । నీటికిఁ దెఱగంటి వక్కెనెఱగూటి
కొగిన్॥ ౨౨॥ క॥ ఎన్నికగను కవ్వడియా । లన్నకుఁ దొల్వేల్పు పొగరుటావుల
మొకవుం। గున్నకుఁ జెన్నగు జేజే। మిన్నకు బలుగొల్లకొలపుఁ బిన్నకునెమ్మిన్॥ ౨౩॥
తే॥ గీ॥ అప్పనంబుగ నానేర్చునట్లొనర్పఁ । బూను చిత్రాంగదయనంగఁ బొలు

చునట్టి । మెలఁత పెండ్లి తెఱఁగు జనమేజయుండు । వినెను వేడుక మదిలోనఁ గొనలుసాగ॥ ౨౪॥ వ॥ వైశంపాయనుం గనుంగొని॥ ౨౫॥ తే॥గీ॥ పెద్దయును మా కాలంబునఁ బేరువడిన। క్రీడి యెట్లు చిత్రాంగద కేలువట్టె । వేడుకలు మీఱ నాలింతు వీనులలర। దాచ కానతీవయ్య యొంతబిసి రాయ॥ ౨౬॥ క॥ అన జడదారియు ఱేనిం। గనుఁగొని సందియము తీఱ గారవమారన్। వినుపింపఁ దొడఁగెఁ గవ్వడి। మును ముద్దియఁ బెండ్లియైన ముచ్చటయెల్లన్॥ ౨౭॥ సీ॥ మగఱాల జిగితూల నగఁజాలు వగఁ గ్రాలు తెలిడాలుగల మేలుతిన్నెలమరఁ । బెనుగట్టులనుకట్టు లను బెట్టునను గుట్టుఁ గని తిట్టఁగనుపట్టుకోటలడర। నలరమ్ము చెలువమ్ము లలిఁ గ్రమ్మి వెలిగ్రుమ్ము మురిపెమ్ము నెఱనమ్ము ముగుదలలర। నెనలేని గొనబూని పెనుకోనలను డేనె తెరలాను దొరలేని తేటులాలయ । నేచట గనుఁగొన్న నేనుంగు లేపు చూప । నెల్లచోటుల గుఱ్ఱంబు లెసక మెసఁగ। ముజ్జగంబులఁ గల ప్రోళ్ళ మురువు నవ్వ । యలరుచుండు నింద్రప్రస్థమనెడు వీడు॥ ౨౮॥ తే॥గీ॥ ప్రోలి పొలిం బట్టు లెక్కింపుఁ గాలి యడరి। ప్రొద్దు తేజీలనవ్వలఁ బోవకుండ। నాపఁ గాఁ గాదె తన వేరి కతఁడు కట్టెఁ। బాకు గుంపులఁ జెలువంపుఁ బగ్గములుగ॥ ౨౯॥ ఉ॥ చొక్కపుఁ బైడిమేడలను సొంపగు పచ్చల చూరుపట్టెలం। జెక్కిన కప్పురాలపని చిత్తరు వ్రాతల పారువంబులన్। దక్కినటంచుఁ బట్టుకొన దగ్గిర మూఁకుల నుండు డేగ చాల్ । నిక్కుచు నంతదవ్వగయ నేరిక క్రమ్మఱివచ్చు నిచ్చలున్॥ ౩౦॥ ఉ॥ ప్రోలికడాని మేడగమిఁ బొందుగఁ జెక్కిన యట్టి పుల్గురా । జాలమెఱుంగు రంగుల తెఱంగుఁ గనుంగొని త్రోవకడ్డుగాఁ। జాలె దుపచ్చి కంచు నెదఁ జందురుఁ డెంచి యొదాని పోయఁగాఁ। దాలిచె నిజ్జిఁగాని యెడఁ దాల్పఁగ నాతని కిట్టియేటికిన్॥ ౩౧॥ చ॥ నెల యరుడెంచి యప్పరిగ నిద్దపుసోరణగండ్లు సొచ్చినన్ । వెలఁదులు లేచిచూచి కపురవేడ్కమెయిం దమకేలు దమ్ములం। దలుపులు మూయఁగట్టువడి తద్దయు నేపట నేలనుండఁగాఁ। గలుగుటఁ జూచ్చు సొల్పె నెలకట్టులనంగను నేలలెంతయున్॥ ౩౨॥ గీ॥ తద్దయును వేలుపుల ఱేని దాడికోడి। గుంపులను గూడి పరతెంచి కొక్కులలరఁ । గడలిడాగ వచ్చిన కొండగమి యనంగఁ। గదిసి తిరుగు నేనుంగు లగడ్తయందు॥ ౩౩॥ క॥ వీటను గల గుఱ్ఱంబుల। గాటపువడి కోడి గడ్డికటిచెను లేమల్। మాటికి పడఁకుచు గాలియుఁ। బోటరితనము డిగి యొక్కమూలం బడియెన్॥ ౩౪॥ క॥ ఎప్పుడుఁ బూవుందోఁటల । నొప్పగు తావులకుఁ జిక్కి యొగిఁ జలిగాడ్పుల్ । తప్పక కాపురముండఁగ । మెప్పొదవఁగఁ జలువ లచట మేకొని యుండున్॥ ౩౫॥ చ॥ పలపులు మీఱ నీఱములఁ బ్రాకుచుఁ దన్ముల మొత్తపున్నిరుల్। తొలుత నువెచ్చపెట్టి పుప్పొడి తోటను మోవులు తావులాని పెక్కులు గిలిగింతలందనరి కొమ్మలనిమ్ములఁ గూడి వీటికిం। దెలతెలవాఱు వేళఁ జనుదెంచును దెమ్మెర దంటయల్లనన్॥ ౩౬॥ ఉ॥ వేలుపు మ్రాని క్రొవ్విరుల పెన్వలపుల్ గొని విస్నువాకపైఁ। దేలుచు దాని చల్వయును దెమ్మెర తెచ్చి యొసంగి చెమ్మటల్। దూలఁగఁ జేయ నిద్దురను దోఁగ

మగల్ జవరాండ్రు వేసవన్। హాళినిమేలుకాంతురట నచ్చరబోటుల వీణెపాటలన్॥ ౩౭॥ చ॥ అలయొలఫోఁటమొత్తముల యందలి మ్రాఁకుల పూవుఁదేనియల్। వెలువడి చేలకాలువల వెంబడిఁ బాఱుచు నూరిపైరులం। బలువిడిఁ బండఁజేయఁగని మబ్బులు నిబ్బితి డాఁగనిచ్చలుం। బొలుపగుతావితో నగళునన్ బొగ లాడఁగఁజేయు నెమ్మి లన్॥ ౩౮॥ చ॥ ఎనమఱలేక ప్రాఁజదువులెల్లను నేర్చుటెకాని లాఁతిచే।తను దల కొట్లనొందెనని తామరచూలిని దూఱివేయు నో।ళ్ళన దుదముట్టఁగాఁ జదువులం గొనుటొక్కటె రెండు నాల్కలం। చొనరఁగఁబాపటేని నగియుందురు ప్రోలిని నేల వేలుపుల్॥ ౩౯॥ సీ॥ చెవులెకన్నులుగాక దవునేలదాల్పరుల్ పలునాలుకలులేని పజ ఘోరలోకి। పగవానిఁగనిపాఱె బలుకొండకలుగున డాఁగనిపసిఁడిపుట్టంబుదాల్పు। లొగిఁ బగల్ నేయని జగముచుట్టంబులు నడకఁదప్పనియట్టి పుడమిదాల్పు। లొక్కనిఁజేరని రొక్కంపుటాడయంన్లు స్ఫుర్తిక్కమైమఱవని చక్కనయ్య। లౌరయనియెల్లవారును నలరుచుండ। నలరుచుందురు తద్దయుబలిమికలిమి। నాడితప్పక సరిలేనిపాడిగలిగి। కొమ రుపాయంపు నెఱరాచకొమరులచట॥ ౪౦॥ చ॥ కలచెలి బిచ్చమెత్తుకొనఁగాఁగని యోరిచియన్నయోరుసుం। గులికెదు దాయపాల్వఱచి కొండలపాలయి మూలఁబడ్డ జక్కులదొరదూఱి వీటఁగల కోమటులొప్పదు రెల్ల నెచ్చెలుల్। కలుములనొప్ప నిల్లు కదలంబనిలేక కడిందిపేరునన్॥ ౪౧॥ చ॥ తెలతెలవోయి కట్టుకొనఁ దెల్లనిబట్టయు లేక మందలో।పలఁ దగుత్రాగుఁబోతనుచుఁ బల్మఱు వెన్ననియన్నవిన్వమై। చెలువముఁ జీరలున్ సిరులుఁ జెన్నెసఁగన్మరియూడకల్గి యుగ్గలమగు వేడ్కఁబొల్తురటఁ గాపు కొమారులు పాడిపంటలన్॥ ౪౨॥ తే॥గీ॥ మేలిమిపసిండి నిద్దంపుమేడకొనల। నలరుఁ బోడులు నిచ్చలు నాటలాడఁ। జూడనడ్డని నెత్తమ్మిచూలి కెప్ప।పాటు పెట్టఁడయ్యెను వేల్పుకూటువులకు॥ ౪౩॥ ఉ॥ క్రొన్నెలవాలయుప్పరిగ కొప్పులనొప్పులు గుల్కుపాయపుం। గన్నెలముద్దుమోములను గ్రాలెడుమేడల దారినేగునా। వెన్నెలఱేని నేర్పఱువ వేఱొకనేరుపుతోఁచమింగదా। వెన్నెలఱేనిలోనలుపు వేలుపుపెద్దయొనర్చె గుర్తుగన్॥ ౪౪॥ సీ॥ ఏనుంగుతలలఁ బాలిండ్లుసొంపుగఁజేసి యానల్పుకొప్పులనలవరించి। చిందమ్ములనుగొంతు లందమ్ముగాఁజేసి యాతెల్వనవ్వులయందుఁబెట్టి। మల్లెమొగ్గలచాలు మఱిపల్వరుసచేసి యామెత్తనిపెదవులందిమిడ్చి। మర్రిపండులఁ జిన్నిమడిమలు కావించి యాయొఱపడు గుల్లయందమర్చి। నలువ యవ్వీటిబోటులనఱువుమీఱఁ। జేయఁబోలుఁగాకున్న నాసోయగంబు। నీసమంతైనఁ గలుగదే వెతకిచూడ। ముజ్జగములందుఁగల పువ్వుబోండ్లయందు॥ ౪౫॥ సీ॥ పైకమ్మునిఁకడించవేకొందు నీవిరిగుబ్బలనిప్పుడోకొమ్మయనుచు। ముగుదచూపవెయది పోవియేపలుకెంపు నింపంగవేడుక నెగడెననుచు। నేలనీయలరున కింతగావెలనెప్ప నెంతసేపుండునే యింతియనుచు। వేయేలచెప్పిన వెలయిత్తునీదండ నాకియ్యరాదటే నాతియనుచు। నచటఁదముఁజూచి

కందువ హాసమునట్టి। నన్నెకాండ్ర జాణతనంపుఁబలుకులకును। లోన మునిమునిసగవులు పూనియొప్పుమఁ। బువ్వులమ్ముదు రతివలా ప్రోలియందు॥ ౪౬॥ వ॥ మఱియు నవ్వీడు నేడ నీడులేని వేడుకలంగూడిమాడి ప్రోడలయి తేఱిఁగావనేతెంచిన లాతివిలాతుల యొడయండ్ల కడవన్నెబెడంగు బంగరుమగవానగలతెగలు ఆపిడిందగిలి నొగిలి నిగనిగ జిగిమిగుల దిగువంబోడిమై కడుఁబుడమింబడి యడరు కడిందియిసుక లెసకమెసఁగు తెరువులును నింతంతనరాని సంతసంబున బంతులుగట్టి రంతులు సేయుచు నెంతయు వింతగాఁ బంతంబున జేమంతిపూబంతుల పొంతకుఁగంతులిడు మేటి తేఁటిదాటుల తేట పాటలవాటంబరయ యిరుకెలంకుల బింకంపు గొఱవంకతెగలుగల కొలంకులును నీలిడాలు చేలలం గ్రాలు మేలిజెండాలచాలు గాలింగదలంబోదలు తగులున మొగిలుతెగలని నిగిడి మిగులపొగురున మగిడి నెట్టనఁగట్టిఁడి పుట్టవట్టులం జుట్టుముట్టికిట్టి పట్టి బెట్టుగ నిట్టూర్పులెడలం గట్టిగఁగొట్టి పట్టరాని కట్టలుకం బొట్టలు పగులంగొట్టు బెట్టిదంపుపని కట్టిపెట్టి నట్టువంబుసలుపు దిట్టనెమ్మి పిట్టలనొప్పి యొప్పులుగుల్కు రాచిల్కవల్కులం జెలువుగులుకు సింగారంపుఁ దోఁటలును హెచ్చుగనిచ్చలు మెచ్చులుగుల్కు నచ్చంపుఁ బచ్చలతిన్నెలఁ జెన్నగు నెన్నరాని తిన్నని పగడంపు గంబంపు గుంపుల సొంపులునింపు పెంపగు కొలువుకూటంబులునుం గలిగి మావులుం దావులుం గలిగి యెలదోఁటసాటిని ముత్తెసరులును బంగారు తీగెలునుం గలిగి వరిచేలపోలికసిరికాటపట్టయి పాల్కడలివడువునఁ దగవుకలిగియుం దగవులేక గోఁతులచే నొప్పియు గోఁతులు లేకయొప్పి కొట్లుండియుఁ గొట్లులేక కరంబు డంబుమీఱు॥ ౪౭॥ క॥ అవ్వీడు యుధిష్ఠిరుఁడను। పువ్విలుతునిఁ బోలుఱేఁడు పొందుగ నేలున్। జవ్వనము బలిమికలిమిని। దవ్వులదొరలెల్లఁ దన్నుఁ దద్దయుఁ గొలువన్॥ ౪౮॥ సీ॥ కడునొప్పు తనదు చాగపునీటియేటికిఁ గడలికొండొకపిల్లకాల్వ గాఁగ। గ్రాలుతనయసంపు పాలవెల్లికి ముజ్జగంబులు దీవులడంబు సూవఁ। దనదు మార్తురకును దట్టంపుటడవిచాలియు నైనచాలని యిండ్లు గాఁగ। దనదు నిండారైన తలవాకిలియె చూడ నేతెంచుదొరలకు నిమ్ము గాఁగ। నొప్పఁ గాపులకెల్లను నోముపంట। పాయులకు సాదులకు గొప్పపట్టుకొమ్మ। బీద సాదలపాలిటి వేల్పుచెట్టు। జగములందెల్ల మేటి యజ్జునికొడుకు॥ ౪౯॥ గీ॥ అడుగు వెట్టిన మారుతుండను గుపట్టు। హైమటువిడినఁ బగతుండు హైమటువిడుఁ। గొమరు దళుకొత్తు నా రాచకొమరుఁబోలు। ఱేఁడు గలఁడె యెందును వలఱేఁడు దక్క॥ ౫౦॥ ఉ॥ వెండియుఁబైడియుం బుడమివేల్పుల కెన్నికమీఱఁదెచ్చి పై। కొండని ఱేఁడొసంగఁగని కుందుమది న్వాలికొండ వేలుపుం। గొండలుగట్టువిల్తుఁ గడుఁగొల్చిన విల్లును విల్లుఁగాఁగొనెన్। మెండుగఁగొల్చిరే నతఁడు మేకొని యేలఁడె యెట్టివారలన్॥ ౫౧॥ చ॥ జగమునఁబుట్టి పుట్టకయె సారెకనుంగొన నెట్టవాటుచుం। బగ లొనరించుచున్ బయలుప్రాకుచు నిల్కడలేకయెప్పుడుం। దగఁజెఱలాడుచుం బుడమిఁ దద్దయు వేడిమి

# రసికజనమనోరంజనము.

చూపి త్రాగనీ రగపడకుండఁజేయు జము నయ్యాయహా సరియానై తేజునన్ ॥ ౧౨ ॥
చ॥ అతని యశంబు ముజ్జగములందును దానయి యెల్లవారలన్ । జతనము మీఱ లిబ్బి
దొర సంగడికాండ్రను వెన్నునన్నలం । గొతుకక చేయ మాట్పడుటకుం గుఱుతుల్
తగనేర్తునన్నొకలన్ । సతతము వారు దాల్చిరి విశంబునువల్వయు నన్వయంబునన్ ॥ ౧౩ ॥
క॥ కలిమియు నడఁకువ పెంపును । బలిమియు నోరిమియుఁ గల్గి వరలెడుదిట్టల్ । నలు
గురతనికిం దమ్ములు । గలరు వడముడియును గ్రీడి కవలుననంగన్ ॥ ౧౪ ॥ తే॥గీ॥ అన్న
యానతిజవదాటకనుఁగుఁదమ్ము । లనువుపఱుపఁ దమ్ములతలంపన్న నెఱపఁ । బాలునీరునుఁ
గలసినబాతివార । లొకరొకరి ముద్దు చెల్లింపుచుందురందు ॥ ౧౫ ॥ సీ॥ చల్లఁదనంబును
వెల్లివిరగ్గుట జాబిల్లికోలహాటసాటుచుండఁ । జక్కఁదనంబును మిక్కిలిపరువంబు వేగం
టికొడుకొట వెల్లడింప । నక్కటికంబును ననదలఁగాచుట వెన్నుని చెలియాట విన్న
వింప । నసమును వడిగల్గి యలరుట మిన్నేటి ముమ్మనమండొట పూని తెలుప । నన్నమాట
యన్న నడుగు దాఁటక పిన్న । పెద్దయంతరువుల పెంపుదెలియు । మేటి క్రీడికెవరు సాటి
ముజ్జగముల । నతనికతఁడె సాటియగును గాక ॥ ౧౬ ॥ ఉ॥ ఆతని సోయగంబు చెవు
లార వినంగనునట్టి ముద్దియల్ । చేతలఁ దొట్రుపాటెనయఁ జెల్వని నాతనిఁ గాఁగ నెమ్మ
దిన్ । బాతిగనెంచి మూఁడుదురు బాపురె నిచ్చలు చూచిరేని యానాతుల చేతలం గలుగు
నానలుకం దుఁడు కొల్లవెట్టఁడే ॥ ౧౭ ॥ శా॥ ఆతండొక్కఁడు ప్రొద్దువోక యొకనాఁ
డందంబుఁ బూఁదోటలోఁ । జేతుల్ చేతులు నేర్చి కొందఱు చెలుల్ నేమంబునన్ వెంట
రా । లాఁతుల్బారులుగట్టి చెంగలువ కేళాభూమిలోఁ ద్రోవలన్ । వాతోడై చనుదేరఁ
గ్రుమ్మరితగన్ జాబిల్లి జాతిన్నెపై ॥ ౧౮ ॥ సీ॥ కలయంగఁ బన్నీరు చిలికినకురువేళ్ళ వీ
వనయొక్కఁడు వీచుచుండఁ । బచ్చకప్పుఁదావి మెచ్చుగుబుల్కాను పండాకుమడుపు
లొక్కండొసంగ । ముత్యాలకుచ్చులఁ బాదలుచిత్తరువ్రాఁత కెంబట్టుగొడుగొక్కఁ
డెమ్మెఁబట్ట । జిలుగు జరీచెల్ల తలగడతోడ క్రిందఁ బదిలంబుగనొకండు కురురుపఱుప ।
వలపుగొలిపెడు చిఱుగొడ్పు లొలయుచుండఁ । గెలనికొలఁకుల తేఁటులు పలుకుచుండఁ ।
జెలులతో ముచ్చటల్ సల్పు చెలమితోడఁ । జెన్నుమీఱంగఁ గూర్చుండి యున్నయెడ
ను ॥ ౧౯ ॥ సీ॥ వేల్పురాయఁడు తనబిడ్డయొద్దికిఁ బంపు పాలుపొంచు పచ్చలబొమ్మల
నఁగఁ । బ్రోలిటెక్కపుఁ జేలగాలిని నేలపైఁ గూలు జేజేచెట్లకొమ్మలనఁగ । బ్రొద్దుమా
వులు హాయఁ బోజాఱి పుడమిపైఁ బడు పచ్చిగడ్డి జొంపంబులనఁగఁ । బుపుఁదోఁటఁ
గవ్వడిఁ బొడఁగాంచి మరుఁడంచుఁ జేరు పూవిల్తు తేజీలనంగ । జిలుకలా రెండు
ముద్దులు చిలుకుచుండఁ । దిన్నెపైనున్న యెకిమీని కన్నుదోయి । విందు చెందంగ ముం
దఱ నందమొందు । పొన్నగున్నకు మిన్ననఁ దన్నడిగియె ॥ ౨౦ ॥ క॥ ఆకైవడి డిగి కొండొ
క । ప్రాఁకునఁ గూర్చుండి లేచి మగుడ నిమదితో । నాకవ్వడి కనసొగసుల । ప్రోకలనం
జిల్కలల్లఁ బుడమికి డిగుచున్ ॥ ౨౧ ॥ చ॥ ఉడుగని వేడ్కతోడ మనమోచెలి యింత

కుముందు ద్రోవలో। నెడనెనుకొన్నదాని కితఁడే తగుఁ గన్గొని ముచ్చటాడి వే। వెడ
లుట మంచిమేలుగదవే యని యందొక చిల్క సంతసం।బడరఁగఁబల్కెఁ గవ్వడికి నల్ల
వినంబడఁ దోడిచిల్కతోన్॥ ౧౨॥ సీ॥ అట్లు నేలకుడిగ్గి యాతండు గన్గొన మఱుపుఁ
జూపుచుఁ గొంతపొంత మెలఁగి। స్రోలసంపఁగిచెట్టు వాలుకొమ్మను బ్రాలి చూడ్కి
కింపుసొంపుఁ జూపుచుండ। నంతవివ్వచ్చుండు చెంతఁ జిల్కలఁ గాంచి రా చిల్క
లార మీరలనుకొన్న। దెయ్యది త్రోవలో నెవ్వనితో ముచ్చటింపఁగావలె నిందు నెం
దులకును। మీరలేపని కరుగుచున్నారలిపుడు। పయనమొకయింత గుదియించి పలుక
నైన। నదియు మాకుఁ జెప్పఁగవచ్చునదియు మైన। నించుకంతనిలిచి వినిపింపవలయు॥ ౧౩॥
క॥ ఇందఱముందఱ నిందది। పొందుగఁ జెప్పం పమీకుఁ బోలనిదైనన్। సందడి డిందఁగ
నాతని। నెందైనఁ గొనిచని ముచ్చటింపఁగఁ జెల్లున్॥ ౧౪॥ క॥ మీయందము చం
దము కం।దోయికి విందుగొలుపుచును దొందరనుండం। జేయుచునున్నది మీపొం।
దే యెడ నెడఁబాయఁ జూతురే యెవరైనన్॥ ౧౫॥ గీ॥ తడయ మీపనియేమైనఁ జెపు
మనియనుచు। నిపుడు మిమ్మింతగా వేగిరింపవలసెఁ। గాని మీచెల్వు కన్నారఁ గాంచు
చున్న। నెంతసేపైనఁ జూడ నేయిచ్చవొడము॥ ౧౬॥ చ॥ అనవిని చిల్కపల్కె నిట
కారయ మేమరుదెంచువెవ్వరిం। గనుఁగొని మాటలాడ నయగట్టిగ దేవరవారితోడ నే।
మనవి యొనర్ప వచ్చితిమి మామదిఁ గల్గినదెల్లఁ బైనముఁన్। జనుటయె కర్జమైనఁ జనఁ
జాలము నీకొలువింత సేయఁగన్॥ ౧౭॥ క॥ ననుమీరడిగినదంతయు। విననిడిఁక విని
పింతుమీకు వేడుకమీఱఁగను మంజువాణియందురు। నను నాచెలియె మృదువాణి
నాఁబడు నిదియున్॥ ౧౮॥ సీ॥ చిత్రవాహనుఁడనఁ జెలఁగుచుండెడు ఱేని వినియుం
డురాతని వీటినుండి। పలుకుచేడియఁ జూడఁ దొలివేల్పు జగమున కేగుచున్నార
మెలమితోడ। ఱెక్కలునిమురుచు మక్కువ వెలిచాన చక్కెరతినిపించు చక్కఁ జే
ర్చి తనబిడ్డలుగనెత్తి తడవుగనినతల్లివలెఁ బెంచుచుండనంత వారిఁ గాఁగ। ముద్దఁగూ
ర్చుండఁబెట్టుక ముద్దుచేతఁ। జనువుమీఱంగ నామెయె చదువు చెప్పి। చక్కఁ దిద్దుకొని
మొఁగానఁ జదువులెల్ల। మనర నఱచేతిలోనివై యుండు మాకు॥ ౧౯॥ గీ॥ అవ
యటుండనిండిఁక వేగసరిగి యచటఁ బల్కు పూబోడిఁబోడఁ గాంచి పల్కులాడి। మర
లిరావలెఁ గావున మాకునిపుడ। నెలవొసంగుము పోయివచ్చెదము టన్న॥ ౨౦॥ వ॥ ఆ
వలంతి చిలుకమేలుబంతుల కాతం డిట్లనియె॥ గీ॥ తొలుత నేలకు డిగ్గుచుఁ ద్రోవలోన।
దవ్వులను మనమనుకొన్నదానికితఁడె। తగును జెలియఁ రో యంటివిదారిలోన। నేమి
చెప్పుకొంటిరి దేనికేన తగుదు.॥ ౨౧॥ గీ॥ అయ్యదిటువంటిదని చెప్ప ననువుపడినఁ। గొ
ఱఁతవెట్టక యానతీఁగూడు ననిన। నలువలంకులుఁ దిలకించి చిలుక కలికి। కలికి పలుకుల
వలపులు చిలుకఁ బలికె॥ ౨౨॥ గీ॥ మంతనంబున మాటాడు మాటయిదియుఁ। బలుక
వచ్చునె యోగాను గా మంచితఱియు। నెవరు పైవారు లేరుగా యిందులోన। నన్ను మన

వారలెగద యీయన్నవారు॥ ౭౩॥ వ॥ అనిన నతండు॥ గీ॥ కలికిచూపునఁ గోలు
వెల్లఁగలయఁజూడ । నేకతముగోరు సన్నగా నెల్లరెఱిఁగి । చూపుతోడన వడిలేచి
చుట్టునున్న। తోడివారలు దవ్వులఁ దొలఁగిచనిరి॥ ౭౪॥ వ॥ అంత మరింతచెంతకుం
జరగి యానిమొగంబునన చూపునిలిపి ముద్దులుగులుకు కలికిపలుకులు వీనులకు విందుగొ
లుప నాచిలుక యల్లన నిట్లుచెప్పందొడంగె॥ ౭౫॥ మ॥ తొలుతం జెప్పితిఁ జిత్రవా
హనుని నీతో నేనిటఁ వానికిఁ । గలదో యొకకొమార్తెయొక్కరితె యాక్రాల్గంటి
నీనేలలో।పలఁ జిత్రాంగదయండ్రు దానిచెలువాపల్కంబుపుంబోడియుం। బలుకం
జాలదనంగనేటికిచటఁ మాబోంట్లవాక్రువ్వఁగఁ॥ ౭౬॥ గీ॥ కలువకంటి సింగారం
పుఁ గడలియందుఁ। గ్రాలుతాబేళ్లఁ జిందంబుమీలుమొసలి । కవయుననఁగ నుప్పారి
మీఁగాళ్లుగొంతుఁ । గన్నుఁగవయును బిక్కలుఁ గరమువెలయు॥ ౭౭॥ గీ॥ వెలఁది
కమ్మవిల్తు విరివిల్లు కాఁబోలుఁ । గాకయున్న నేలగలుగునడుమ । ముత్తెములనుపేర
ముద్దులుగుల్కెడు।వ్రేళ్ళసందియానవాళ్లమూడు॥ ౭౮॥ చ॥ నిలుకడగన్నక్రొమ్మెఱుఁ
గు నిక్కపుఁజేతలు పూనియెల్లెడఁ । మెలఁగుకదానిబొమ్మ నునుమేనను గమ్మనితా
పులీను పు।వ్వులుతుని పూపుముల్కు తెలివిప్పచూకాటపుఁ గన్నుదోయికిఁ । బెళు
కెను తెప్పపాటుగలవేలుపుముద్దులగుమ్మయారయఁ॥ ౭౯॥ సీ॥ వెండికొండదొరయా
వెలఁదుకచనుదోయి వలమురిమేటి యాకలికిగొంతు । రాయంచపయిదిట్ట యా
యింతినెన్నడ తమ్ములచుట్టంబు కొమ్మకేలు । వలపులఱేఁడు లానెలఁతుక పెన్నెరుల్
చందురుమామ యాచానమోము । పాములఱేకిమీఁదు పడఁతుకనూగారు తెఱగంటి
వంట లాతెఱవకన్ను । లిటులువేల్పుల దొంతిమై యొసఁగుచున్న । కొమరుపాయంపు
ముద్దియఁగూడఁగల్గు। మేలుసమకూడెనేని యానేలఱేఁడ। కోరు కోరికలెల్లఁ జేకూరు
టరుదె॥ ౮౦॥ గీ॥ తలిరులింతియొడలి మెత్తతనముకోడి। యొడలులేనట్టివానికే యా
చెలమ్యోఁ। దొడరియేసుంగు లెలనాగ నడకకోడి। నడకతప్పిన కొండలకడనుజేరె॥ ౮౧॥
సీ॥ వాలుమించును మించువాలునునదలించు పొలఁతుకకన్దోయి పొలుఁగుటారు।
వింటిబెళ్కును బెళ్కువింటినినదలించు నాతుకకన్బొమల్ నడుమతీరు । తమ్మికెంపు
ను గెంపుదమ్మినినదలించుఁ బడఁతుకవాతెఱ యడుగుదోయి । పొఱఁగుబంతినిబంతి
పొలుఁగునునదలించుఁ గన్నియనెమ్మేనుఁ జన్నుదోయి। వెలఁది సోయగంబేమని విన్న
వింతు। నచ్చరలయందు జక్కులమచ్చెకంటు। లందుఁజిలువ రాకన్నియలందు నెందుఁ।
గనియువినియునెఱుంగ నీకలికికీడు॥ ౮౨॥ ఉ॥ చందురుమామతమ్ములును జామ మొ
గంబునుబోల ముందుగాఁ। గందునుమోడ్పుఁబాపుకొనఁ గాల్కని తామరసాటివచ్చె
నె।మ్మిం దగవేడివేల్పు నెఱమెప్పుల నిల్కడలేకకుందునా । చందురుఁడీడువచ్చుటకుఁ
జాలకమారుతుఁడయ్యె దానికిఁ॥ ౮౩॥ క॥ ఎలనాగవాలుఁగన్నులు । కలువలనఁ చుఁ
జేరు తేటిగములనదల్పఁ । దెలిచాననడుమనుంచిన । యలరెడు సంపంగిమొగ్గయన

చుక్కమరున్॥ ౬౪॥ శా॥ నేలంగల్గు పులుంగులెల్ల నెపుడున్ జెల్వారఁబల్కంగ
నే। నేలా పల్కఁగ నేరనైతినని యెంతేఁ గెంపు కన్బల్గుతా। లోలోనం దలపోసి నేర్చె
నవలాలోఁ జేరి కాదఁటిరే। నేలాకోయిలపల్కులంద్రు వినువారెల్లం బువుంబోఁడికిన్॥
౬౫॥ చ॥ కలువలు లేళ్లు వాలుగలుఁ గాటుకపిట్టలుఁ దేఁటిచాల్లుఁ దూఁపులుఁ దెలి
దమ్మిరేకులును ముత్తెపుఁజిప్పలు మంచుగ్రోలుపుల్గులు ననువ్వుతమ్మిదియగుబ్బెత
కన్నులకోడెనంచుఁ గ్రేవలఁ జెలువారఁ దొమ్మికుల వ్రాసిరనంగను వీనులొప్పగున్॥ ౬౬॥
గీ॥ అతివ చనుపూవుగుత్తుల యండఁ జేరఁ। జానకెమ్మోవి దొండపండానఁ దుమ్మెద
లును జిల్కలుఁ గానలఁ దడవునిలిచి। యారును బలుకులును నయ్యెనతివ కేలమి॥ ౬౭॥
ఉ॥ తుమ్మెదదిమ్ము సంపెగయుఁ దోరపుఁ జేఁకటి చందమామయున్। దమ్ములు రిక్కచా
లు మదిఁ దాలిచి నెయ్యముఁ దొంటి కంటుఁ డా। మిమ్ములఁ బాసి కూడెనన నింపగుఁ
జూపులు ముక్కు చెక్కునున్। గ్రొమ్ముడి మోముగోము జిగిగుబ్బడు కేల్గవ యింతి
గోరులున్॥ ౬౮॥ సీ॥ మగఱాలచేరిక బిగిదప్పిచెడకున్నఁ బుడమిఁ గొండలాకింత పు
రుషువచ్చుఁ। బన్నీటికూడికఁ జెన్నువాయకయున్నఁ దమ్మిమొగ్గలాకింత తరము
వచ్చు। నెలవంకసోఁకుల నెఱిదప్పిపోకున్న జక్కవలాకకొంత సవతువచ్చు। నెత్తావి
తోఁగూడి నిండారియుండినఁ బైడికుండలు కొంతయీడువచ్చు। మేలిమగఱాలపేరుల
మెఱుఁగుఁ జెంది। క్రొత్తపన్నీటివ్రాఁతలఁ గొమరుమీఱి। వెలయు నెలవంకసోఁకుల
కలరఁ జాలి। తావిగల్గిన చనుదోయి రేవికరయ॥ ౬౯॥ గీ॥ చాననిద్దంపు జిగిమోవి
చక్కఁదనము। వెలసితద్దయుఁ దెఱగంటి చెలువెదూరు। కన్నియతళుకుఁ దెలివాలుఁ
గన్నుదోయి। చెలఁగిమిక్కిలి తెఱగంటి చెలువెదూరు॥ ౭౦॥ మ॥ కనుచేవల్ బిగిగుబ్బ
జక్కవల వీఁకంజూచి లోఁజంకి వేఁడ్కను జేరంజని మోముచందురుని యడంజేర
నూగారు పాఁమని కింబొక్కిలి పుట్టవే వేడలి డాయంగాంచి వేడంగ వచ్చిన జాబిల్లి
యనుంగుకొమ్మలన మించెన్ ముత్తియంపుస్సరుల్॥ ౭౧॥ గీ॥ మల్లెమొగ్గలజిగిఁ బో
లుఁ బలుమెఱుంగు। బలుమెఱుంగును బోలుఁ గమ్మమెయితేటు। లోలిమెయిఁ దేఁటు
లను బోలు నంలు నెఱులు। వాలు నెఱులను బోలు నప్పడఁతియూరు॥ ౭౨॥ చ॥ మెలఁ
తుక చన్నుఁగొండలకు మీఁదను జిందపుదిట్టనెంతయున్। జెలువుగఁ గొల్చి గొంతు
వెసఁ జింధపు దిట్టతనంబు పూనఁగాఁ। బొలుపుగఁ జుట్టువాలు దారఁ బొందె బెఱుం
దులుసైవలేక నేర్పలవడ వెన్నుఁ జేరె నలపైదలికీల్జడ వింతదోఁపఁగన్॥ ౭౩॥ చ॥ మరుఁ
డను వేఁటకాఁడతివబల్చనుఁగొండలయండ ముత్యపుస్సరులను బియ్యమోసలఁ బె
నంగఁగ మచ్చిడి యందగాండ్ర యబ్బురమగు డెందపుం బులుఁగు చిత్తముఁ బట్టుచు
నీరువ్రావ డగ్గరఁ జనుబొడ్డుడిగ్గియకుఁ గట్టినబంగరుపొట్టులత్తముల్॥ ౭౪॥ గీ॥ జవ్వ
నపుతలఁ గన్నియచన్నుదోయి। కొనకలిమిదోచుకొనియెఁ గాకయున్న। నింతలో
గుబ్బలఁ గల్మిమెట్టులబ్బె। నేమికతమున నడుము కడలేమిగలిగె॥ ౭౫॥ గీ॥ చెలఁగి

పలుచాలుఁగేలుపై జిగులఁబోలు। నాసదానిమ్మయు నిగుర్లనలరుమొదలు। నడుముఁ
బుదిలేని వేలుపుఁ గడఁగికొలిచి। తామునన్లై చనులఁగొప్పుఁ దఱులఁబోలె॥ ౯౬॥

ఉ॥ పోలఁగ వెన్నచూపె వరిపొట్టలు నేనుఁగు కేలు మోడ్చెఁదా। మేలును బొట్టలోన
దలపెట్టుకొనెం దళవంచెనంటులున్। దూలుచు లేళ్లగడ్డితినెఁ దొయ్యలి పిక్కలఁ
జన్నుదోయి మీఁ। గాళుల నిద్దపుం దొడలఁ గన్నులఁబోలఁగఁ జాలమింజుమీ॥ ౯౭॥
క॥ నెలయూ మొగంబు జిగివె। న్నెలయూ తెలినవ్వుజవ్వ నెఱబంగరు గి। న్నెలయూ
చన్నుంగవతి। న్నెలయూరె పిఱుందుదోయి నెఁతకుఁదలఁపన్॥ ౯౮॥ గీ॥ కాలియం
దెలన్ పాదులఁగలయఁబెరుగు। సరఁటికంబంబు లెన్నంగ నతివ తొడలు। దానియాకు
వీపు చలువదలఁచిపాదు। కదిసినట్టి తాబేళ్లు మీఁగాళ్లుతలఁప॥ ౯౯॥ గీ॥ చెలువ నె
మ్మోము చందురు గెలువఁ జూచి। యడుగుఁ దమ్ములిదియె మంచియదనటంచు। సతని
కొమ్మలనీడ్చి తెచ్చి తమలెంక। లుగ నొనర్చికొనెనన గోళ్ళొప్పెఁ జెలంగు॥ ౧౦౦॥ చ॥ చిలు
కలకొల్కి నెన్నడుము సింగపుఁ జెల్వముఁ జూపుఁ జూపు తూ। పులపసమించుమించుల
కుఁబోడిమిపై జిగినించునించుమి। క్కిలి నగుఁ బల్కుపల్కుదరు కెంపులసొంపులుమావు
మావు వె। న్నెలఁగని నవ్వునవ్వు జిగినిద్దమొఱుంగు మెఱుంగుఁ జెక్కులన్॥ ౧౦౧॥
గీ॥ మీలనేలఁజాలు వాలుగన్నులదాలు। మిన్నచెన్నుఁదన్నుఁ గన్నెకౌను। మించు
మించుమించు సంచయానమొడలు। పొగరుతొగరుచిగురు ముగుదకేలు॥ ౧౦౨॥
సీ॥ వెన్నెలగువ్వల వెలయించుఁ జెలినవ్వుఁ జన్నులు నిడువాలుఁ గన్నుదోయి। పుట్టతా
పులమీఱుఁ బొలఁతుకపొక్కిలి మేనునజెలువారు మెఱుఁగుటారు। పసిఁడితివ్వలనేలుఁ
బడఁతుకపైజిగి పిఱుఁదులు నిబ్బెంపు బిగువు చనులు। కెంపుఁ దమ్ములసిరి గెల్చుఁ గన్నియ
మోవి కన్నులు నునుపాఱు కలికియడుగు। లౌర యాముద్దరాలి రూపమరఁగన్న। నడ
విలోఁ గాయగసరుల నారగించి। చెట్టునీడలఁ బవళించునట్టి తపసు। లైనఁ జేరికొల్వరె
యింతియడుగుదోయి॥ ౧౦౩॥ చ॥ చెలువము మావిగున్న యలచెల్వపుఁ గొమ్మలె
చేతులందపుం। దలిరులె కేలుదోయి నెఱతావులపూవులె గోళ్లు తేనియల్। దొలఁ
కెడుపండ్లె గుబ్బగవ లోఁతగు తొఱ్ఱయె బొడ్డు పండ్లకై। చెలువుగ దొఱ్ఱ వెల్వడిన చీమల
బారులె యారుకన్గొనన్॥ ౧౦౪॥ ఉ॥ తమ్ములు కన్నుదోయి బలితమ్ములు మేలిపిఱుం
దులెంతొ గు। త్తమ్ములు గుబ్బలేనుఁగుల తమ్ములు నెన్నడలెన్నమించు మొ। త్తమ్ములు
మేను కెంపుసయి తమ్ములు చేతులు కమ్మవిల్తుచే। తమ్ములు చూపు వీనులకి తమ్ములు
పల్కులు ముద్దుగుమ్మకున్॥ ౧౦౫॥ ఉ॥ ఆనగుమోము చక్కఁదన మాబిగిసిబ్బెపు
గుబ్బదోయి యొ। ప్పా నిఱుపేదకౌను సొగసా వెలిదక్కు పిసాళిచూపుడం। బా నిడు
వాలుగన్నెఱకు లాజిగినిద్దపు మేనిసోయగం। బా నునుసోగపెన్నెరుల యందమునౌ రె
మొయియారికే తగున్॥ ౧౦౬॥ క॥ అమ్మచ్చెకంటి చక్కఁద। నమ్మంతయుఁ జెప్పఁదర
మా నాతిపిఱుఁదు సం। దమ్మొన్నఁగ నొకనాడా। నెమ్మొగమెన్నంగ నొక్క నేలయొం

జుమ్మీ॥ ౧౦౭॥ గీ॥ అనుచు వెండియు నేమియో యనఁగఢంగు। చిలుకననుచేత నే నన్నిఁ జెలువుమీఱఁ। బలికెనాతండు తాళుమోచిలుకరాయ। వలదు నీమాటకడ్డంబు వత్తునిపుడు॥ ౧౦౮॥ గీ॥ నన్ను సైరించి నేనిపుడెన్నఁబోవు। పలుకువిని దానికిని మాఱు పలుకవలయు। వింతదో వంగనా తోడనింతదనుక। తేటగానీవు పలికిన మాటలందు॥౧౦౯॥ క॥ "వెలిచానననడుమనుంచిన। యలరెడు సంపంగిమొగ్గ"యని చెప్పితివా। చెలువను నామెయొనర్చెను।కలుగును వేఱొండు తెఱఁగు కలయది చెపుమా॥౧౧౦॥ గీ॥ అనినఁ జిలుకపలుకు నా వెలిచానయొ।చేసె నానెలంతఁజెప్ప కింత।వఱకు నన్నిసైపవలయును బయనంపు।తొందర మును చెప్పఁదోచదయ్యె॥ ౧౧౧॥ సీ॥ నలువరాణియుఁదాన గొలువుండియొక్కనాఁ డచ్చరల్ చనుదెంచి యాడిచనిన। పిమ్మటఁ గొంతసేపమ్మద్ద గుమ్మల చక్కఁదనంబులు చాలఁబొగడి। మాటవెంబడి వారిసాటివారలఁ జేయఁ దన కౌఁగా కొరులకుఁదరముగామి। మాటికిఁజెప్పిన మగఁడుఁ దాననుజేయ రాదువచ్చె ననెడువాదుసల్పి। వారిమీఱువారినె చేయవచ్చుననెడు। మాటపట్టింపుఁబట్టియమ్మచ్చెకంటి। యీచెలినొనర్చి పంతు నెగ్గించుకొనియె। నలువగరువంబు దిగజాఱెనాటనుండి॥ ౧౧౨॥ క॥ ఈయతివఁబోలనలువకుఁ జేయంగాఁదగిన నేర్పు చేకుఱమినిజం। బోయేలిక చేకురెనే। నాయనయెందైనఁ జేయఁడాము న్నెపుడుఁ॥ ౧౧౩॥ సీ॥ దారి నేతెంచుచుఁ దడవొండొరులతోడ వెలఁదిచక్కఁదనంబె వేయినోళ్ళఁ। బొగడిమెచ్చుచు నామె సొగసునకెవ్వండొ తగుమగండని యింతతడవుమేము। పరికించుచున్కి నిప్పట్టున మిముఁగాంచి మీచెల్వుకనులారఁ జూచిచాల। మదినచ్చెరువుఁబూని మాలోన నేము గా కలికికీడగువానిఁ గంటిమనుచు। సంతసముపట్టఁజాలక సరగడిగుచు। నంటిమీతండ తగుననివింటివిగద। గడియయును మాకునిచ్చటఁ దడయఁదీఱ। దేగివత్తుము మఱచిపోగొనదవుసున్న॥ ౧౧౪॥ క॥ అనివీడ్కొని రాచిల్కలు వినుత్రోవను మీది కెగసి వెసఁజూపునకుఁ। గనఁబడకసాగిపోయెను। గనుచుండెడి కేళిచూడ్కి కళవళపడఁగ॥ ౧౧౫॥ వ॥ అనిన తరువాతికత చెప్పుమని జనమేజయుండడుగుటయు॥౧౧౬ సుగంధివృత్తము॥ పొన్నగున్ననెక్కి గొల్లపువ్వుబొండ్లతోడుతఁ। వన్నెమీఱఁ జేతులెత్తి పల్వురొక్కచెల్వునఁ। జెన్నుమీఱ మ్రొక్కుకున్నఁ జేలలియ్యనంచు నాఁడన్న వంతు గెల్చుకొన్న యట్టిదిట్టవేలుపా॥ ౧౧౭॥ కందము॥ గోమూత్రికాబంధము॥ దరివిసమిడః జచుకొమ్మం। బొరిగొని తెలివొందు పైడిపుట్టమురాయా। పొరిఁగసవొడలను గ్రమ్మం। దెరిపిని జెలినందుఁగూడి దిట్టగురాగా॥ ౧౧౮॥ గద్యము॥ ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్యరచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరి వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునఁ బ్రథమాశ్వాసము॥

# ర సి క జ న మ నో రం జ న ము.

## ద్వి తీ యా శ్వా స ము.

క॥ సిరి యెడవాయక యొప్పున । నిరవుకొనం గొలుచువారి నెల్లర నెమ్మిం। దిరముగ నేలుచుఁ గడలిక। బరగన్నెలకొన్నవేల్ప వలమురిదాల్పా॥ ౧॥ వ॥ అంత వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం దొడంగె॥ ౨॥ చ॥ వలపులమేలుకొల్పు తెరువర్లతలంపని కీడు చల్లగా।ద్పులకును మక్కువపట్టు మరుపూన్కికి వేడనితోడుపాటు రా।చిలుకలమేలు జాజికిని జెప్పఁగరానివిసంబు గందుఁగో।యిలలకు నోముపంట చెలువేమన న్మామనివచ్చె మెచ్చఁగన్॥ ౩॥ గీ॥ వీఁకవచ్చునామని యేని రాకకలరి। తొంటివసపుచీరెలువిప్పి తోఁపుచీర। లెలమిఁదీఁగె చెల్వాలుదాల్చె యొసఁకమ్మెసఁగు। పగిదిఁబండుటాకులురాలి చిగురులొదవె॥ ౪॥ సీ॥ చెట్లకన్నిటికిని జెడిమున్నెపోయిన సరిలేనితావులు మరలఁగలిగె। జాజికొమ్మకు మున్నుజరగని మరుతూపుల రసైన నొకటియనంటకుండెఁ। గోయిలగమికెల్ల గ్రుడ్డప్పటియనుండి గలకాకిమూఁకల చెలిమివదలెఁ। బెనుమావికొమ్మకుఁ బెద్దతడవులేని కోయిలపల్కుల కొమరు గలిగె। నింతకెన్నఁడు నిలుకడ నెఱుఁగనట్టి గాలికిమ్మాయి నెమ్మదిచాలఁగలిగెఁ। జెప్ప నొప్పనె యామనియొప్పిదంబు। చిలువయెకిమీనికైనను నలువకైన॥ ౫॥ సీ॥ పొంతమగుచుఁజను పూవుగుత్తులనొప్పి కోయిలపల్కుల కొమరుమిగిలి। ముద్దులుగుల్కెడు మొగలిరేకులమించి చెలువంపుఁబావటఁ జెన్నుమీఱి। వింతవింతలతీఁగె దొంతులసొగసూని పలుమల్లెమొగ్గల చెలువుదాల్చి। బొట్టుగలకడింది పొలుపునసలరారి మోవిచిగురుల బల్ ఠీవిఁబడసి। యామునేసుఁగు నడకల నల్లఁదనరి। కన్నులకుఁబండువొనరించెఁగాన లచ్చి। యెల్లవారికి సంతసమొదవలోన। వెల్లిగొలిపి యయ్యామని నెల్లతఱిని॥ ౬॥ గీ॥ పురుడులేకుండ నక్కానపువ్వుబోడి। యలరుకొమరుఁగనిన పల్కులాలకించి। యీసులేకుండ నత్తఱినెల్లపులుఁగు। గములుఁబిల్లలఁ బెట్టంగఁగడఁగె నొగడఁక॥ ౭॥ చ॥ కొలఁకులనాడుచుం బొగడగున్నల దాగుడుమూతలాడుచుం। దొలఁగక చిల్లులాడి పువుదమ్మిగఁ జిమ్ముచుఁ దీవెతూగుటుయ్యేలలనూఁగి పువ్వుపొదరండ్లను దూఱికదల్చి తోఁటలో। నలరులు రాల్చుచుండిరిగె నామనిఁదెమ్మెర పిన్నలెయ్యెడన్॥ ౮॥ చ॥ వలిపువునీటికాలువల పజ్జలకుంజని యొలలాడి మే।ల్చలువలఁదాల్చి గాడ్పు నైఱజాణఁడు మెల్లనఁబూవుఁదోఁటలో। నలరులకొమ్మఁజేరి చిగురాకుమునుంగుఁ దొలంగఁజేసి యవ్వల విరిగుబ్బగుత్తులను వ్రాలుచుఁబైకొని తావులందెడున్॥ ౯॥ చ॥ అలరులతేనె వానగను హాయిగ మ్రోయుచు నేగుతేఁటిచా। లులుఘుమఘుమలం జెలంగు మొయిలుంగమిగాఁగఁ జెలంగికూయు కో।యిలరొదనెమ్మికూఁతగను నెల్లెడ

గొజ్జఁగిపూవుఁ నీరువం। కలఁగమిగాఁ గనొప్పి ననకాఱు చెలంగెను వాన కాఱునన్ ॥ ౧౦॥
సీ॥ వాతెఱమఱుఁగైన పలుచాలు చాఱ్పునఁ జిగురాకులోఁ లేఁత మొగడలమర। గబ్బి
గుబ్బలనొప్పు కప్పుటాసరులునాఁ బూఁతగుత్తులఁ దేఁటిచాలు దనరఁ। గైదోయి నలఁదిన
గందంపుఁబూఁత నాఁ గొమ్మలఁ బుప్పొడి కొమరు మీఱఁ। జెమ్మటపోనీఁచు చిఱువీవెన
యనంగఁ బండాకుగాలిచేఁ బ్రక్కఁగదలఁ। బొదలు వేడుక ముద్దులు మూటగట్టఁ।
జాలు సింగారములు వెదచల్లుచున్న పూఁవుఁదోఁటను గైసేసి తావి తియ్య। కన్నెమామిడి
యొక్కటి చెన్నుమీఱె॥ ౧౧॥ సీ॥ వలిగాలి మెయిసేల పయిరాలు విరిచాలు వేనలి
దిగజాఱు విరులు గాఁగఁ। బువ్వుఁగోన నెనలేని పాలుఁబూసిన నతేనె జొబ్బిలు చెమ్మట సోన
గాఁగఁ। బలుకొమ్మలను సొమ్మసిలు తుమ్మెదల డిమ్ముజాఱెడు కప్పుఁగొప్పు సరులు గాఁగఁ।
జిగురేయెడల మేయు బిగిఁగూయు పలుకోయిలల పల్కు లలగిల్కు పలుకు గాఁగ। దళి
లుపుప్పొడి చిటులుఁ గందంబు గాఁగఁ। జిలుకపలుకులు చెలువార వలపులెసఁగఁ। గానకన్ని
య యామని పేనిఁ గూడి। యంరువిలుకాని కయ్యంబు సలిపెనపుడు॥ ౧౨॥ చ॥ చిగు
రుకటారి నూఁటె వెడసింగిణి కేలనమర్చి సూరెలం। దగి గోఱువంక పాఁజుగడు డాడిగ
రావడి నారిదీటుచుం బొంగకునఁ జిల్కతేజి మరపుల్ దుమికింపుచుఁ దేఁటులార్వఁగా।
జగములమీఁదికి న్వెడలెఁ జక్కెరవిల్తుఁడు మచ్చరంబునన్॥ ౧౩॥ వ॥ అట్టియామని
యందు॥ ఉ॥ పన్నుగ నన్నుమిన్న చెలువమ్మటు వీనులవిందుగాఁగ ముద్దన్న దివిన్నవించి
చిలుకల్దగ మిన్నునఁ జన్నసంజియున్। గన్నియ రూపుకన్నుఁగవఁ గట్టినయట్టుగ బిట్టు
తోఁచఁగాఁ। గన్నులవింటివంట తనకైవడి చూపెను గ్రీడిపైవడిన్॥ ౧౪॥ సీ॥ కనఁ
డెట్టయెదుర నిల్చిన వారలనునైనఁ గనియెనేనియు నలుగంటఁ జూచుఁ। జెవిఁ జొనుపఁ
డొరులు చెప్పెడుమాటలఁ జొనిపె నేనియు నేమిటను చునడుగుఁ। బలుకరించఁడు
తన చెలికాండ్రనైనను బలుకరించిన వెడపలుకు పలుకుఁ। బిలిపించుకొనుసు డాఁ బలు
మాఱు లొండిక నెంతసేపటికిని నేగకుండు। మిన్నుమన్నును గానక మెలఁతమీఁది। కూర్మిఁ
బలువింత వలవంతఁ గుందుచుండె। నడుమసిరి యెత్తుకొన్నచో మిడిసిపడెడు। మలుచ
మానిసిఁ బోలి యచ్చడమిఱేఁడు॥ ౧౫॥ సీ॥ గట్టువిల్కాని నెక్కటి నోరిచినగండు
చెఱుకువిల్తు నిమీఁదఁ జెల్లదయ్యె। మింటిమీఁచను గూలమీటిన యుకుటింతి కనుమీల
మీఁదను గదియదయ్యె। వింటివారల నెల్ల వెఱపించు లావున్న బొమవిండ్లపైఁ జూపఁ
బొసఁగదయ్యె। జగములెల్లను గెల్చు తగటుక్కు లిపిఱుందు దీవులమీఁదను దివురదయ్యె।
దొల్లి ద్రోవది పెండ్లిముందల్లమీను। నొక్కయేటునఁ బడనేసియున్న నాఁటి। మగతనం
బేమియు సచటుమనుని మీను। నెపుటసాగింపలేఁడయ్యె నిపుడు క్రీడి॥ ౧౬॥ క॥ చాల
మునుచిల్క చెప్పఁగ। నాలించిన చెలిపిఱుందు నంచపుఁ జూపున్। నేలకుఁ గోలకుఁ దెచ్చె
ను। వాలాయము పేనిమేనుఁ బలుడెందంబున్॥ ౧౭॥ గీ॥ ఎన్ని తీసినఁ గ్రమ్మఱ నెప్ప
టట్లు। యూరుచుండెఁ బల్ తూపులున్న వాని। రెండుమూఁడమ్ములున్న మరుండెగెలి

చె॥ సహాసలువచెయువుల నేమనఁగవచ్చు॥ ౧౮॥ ఉ॥ ఆమనిఁగోయిలల్ చిలుకలా
మని సేయఁగఁ దాళలేక లోఁ। దామరకంటి నెన్నుచును దామరలింపఁగరాని కోర్కె
తో । వేమఱుఁ దుంటవిల్లుగొని వేమఱుఁ డేయఁగ నొచ్చికుందు నా । లేమను జూడ కిప్పు
డెటులేమనువాఁడ నటంచునిచ్చలున్॥ ౧౯॥ గీ॥ ఏకతంబున ననబోఁడి నెదను దలఁప ।
నేకతంబున ననవిల్తుఁ డేయుకుండు । నలవిరుంటను ననదూపులల్లఁ దొడిగి । యలరువింటను
నడయాడు నరదమెక్కి॥ ౨౦॥ వ॥ ఇట్లు చెఱుకువిలుకాఁడు పఱుపు కఱకుటంపఱు
నెఱకులు దూర నోరువలేక యాకవ్వడి వడంతుక తనకన్నులం గట్టినట్టులయినఁ దన
లోఁ దానిట్లని పలవింపందొడంగె॥ ౨౧॥ చ॥ కలికిరొ యిప్పుడేమి యలుకా యలుకా
పలుకాడవిట్లు నన్నులమటఁ బెట్ట నాయమగునా తగునా తెగునా యికింతటన్ । వల
పిది యేలుకొమ్ము మగువా తగవా పగవానియట్ల నన్ దలఁపఁగ జాలిచూపవలదా
వలదా వలఁ దాళనేర్తువే॥ ౨౨॥ ఉ॥ నాయనుఁగున్నెలంది తగునాయను నీవెత
సైచువాఁడ నే । నాయనుమీఁదఁ దాళఁగలనాయను నన్నిటులేచ నాయమా । నాయనుఁ
గూర్మిఁ దప్ప నగునాయనుఁ జక్కని గుజ్జుమావి గు । న్నాయనుఁ గిన్కఁ జూప నదనా
యను నేఁ బగవాఁడ నాయనున్॥ ౨౩॥ వ॥ అనిమఱియుం దనలోన॥ ౨౪॥ ఉ॥ దాని
మెఱుంగుఁ జెక్కులును దాని చవుల్దులకించు మోవియున్ । దాని నిగారపుం దొడలు
దానికనుంగవ దానిగుబ్బలున్ । దాని మొయారపున్నడలు దాని చొకారపుమేని
చెల్వమున్ । దాని మొగంబునందమును దాని పొయల్లనఁ గాంచు టెన్నఁడో॥ ౨౫॥
వ॥ అనియిట్లు॥ గీ॥ పుడమియంతయుఁ గలిగియుఁ బొడవుమలల । వంటి పసిఁడిగుట్ట
లుగల్గి పడఁతిపిఱుఁదు । దీవులను జన్నుగొన్న బిందియలఁ గోరు । ననయమాతఁడు
దొరలకుఁ దనివిగలదె॥ ౨౬॥ సీ॥ నెలఁతుకమోవి తేనియలానఁగాఁగోర నేచవియు
ను నాల్కకెక్కదయ్యెఁ । బడఁతుకమైతావి పసయెఱుంగఁగఁగోర ముక్కునకేతావి
సోకదయ్యెఁ । జిలుకలకొల్కి నవ్వులు కులువినఁగోర వీనులకేపాట వెలయదయ్యెఁ ।
గ్రాల్గంటి నెఱ సోయగముఁ జూడఁగాఁగోర నెంతేదికన్నులకొప్పదయ్యెఁ । దలిరుబోఁ
డి నెమ్మెయి మెత్తతనముఁ గోర । నొడలికిని బడదయ్యె వేఱొకటిసోఁక । నేమిచెప్పుదుఁ
గవ్వడియింతినొక్క । దానిఁ దక్కంగ మఱి యున్నవానిమఱచె॥ ౨౭॥ గీ॥ ఇట్లు
నెలఁతమీఁది యొదఁ ద్రిప్పఁగాలేక । యలరుఁదోటకేగ నన్నియుఁ జటఁ । జక్కఁ బడు
నటంచుఁ జనియెఁ బూఁదోఁటకుఁ । జెలులు కొందఱవలఁ జేరి రాఁగ॥ ౨౮॥ సీ॥ క్రొన్నన
గుత్తులు చన్నులఁ దలపించుఁ దుమ్మెదల్ కురులచెల్వమ్ముఁ జూపుఁ । జిగురుటాకులు కేలి
చెలువంబు వెలయించు నేనుఁగు ల్మెన్నడ నెన్నఁ జేయు । దొండపండులు మోవి నిండు
చెల్వముఁ జెప్పు సంపంగి ననముక్కు పెంపునమువు । నరఁటిచెట్లు తొడలయందమ్ముఁ
గాన్పించుఁ జిలుకలు పలుకుల చెలువు దెలుపుఁ । జానరూపును మఱవంగఁగాన కేగఁ ।
దెఱవరూపుఁ దక్కఁగ నన్నిమఱచిపోయెఁ । దప్పనేతానొక తెఱంగుఁ దలఁచుకొనఁగ

దయ్యె మొండొక తెఱఁగుఁ దాఁ దలఁచు ననుట॥ ౨౯॥ ఉ॥ కమ్మని తెమ్మఁ దెమ్మెరలు
గ్రమ్మఁగఁ గమ్మని వింటిదంట పూవమ్ములు చిమ్మ జొమ్ము మని యామునఁ దుమ్మెద దిమ్ము
ద్రిమ్మరఁ గొమ్మల నెమ్ములి మ్ములను గూయఁగఁ జెమ్మట గ్రమ్మి తమ్ము లొక్కుమ్మడి
దొమ్మి సేయ దొరయమ్మలికం బుపుఁ దోఁటఁ గ్రుమ్మఱుఁ॥ ౩౦॥ సీ॥ అదె కొమ్మ
కాఁబోలు నని తాయఁగాకున్నఁ జెట్టుకొమ్మయటంచుఁ జెప్పఁ దివురుఁ। కలికి కప్రంపుఁ
బల్కులని చేరఁ గనక ముద్దుగంబూరంపు ముక్కలనును। మోవి చివురటంచుఁ బోవును గా
కున్న మోవి చెట్టలయాకు మొలకలనును। విరిగుబ్బలవె యంచు నరుగును గాకున్నఁ
బూగుత్తులంచును బోసఁగఁ బల్కుఁ। గానలోపల నెల్లెడఁ గానిపించు। నలరుఁ దీవెలఁ
గోయిలపలుకు గముఁ। బొన్న కాయల మంకెన పూలఁ జూచి। చెలిమికాండ్రకుఁ దన
గుట్టు తెలియకుండ॥ ౩౧॥ వ॥ అప్పుడొక్క చెలికాఁడు విశారదుండను వాఁ డది
యుల్ల నల్లన నుల్లంబునం దెల్లంబుగాఁ దెలిసి మెల్లనఁ దన ప్రౌఢతనంబు వెల్లడిగాఁ
గవ్వడి యొద్దలు నెవ్వడిందడవి యాతని తోడ జాడగా నిట్లనియె॥ ౩౨॥ ఉ॥ దేవర
మేని కాక చలిదేఱెను తావులఁ గుల్కు కొమ్మలం। దావల మేలికొమ్మఁ గని యారసి
యా విరిగుబ్బ గుత్తులుఁ। బ్రోవగు కప్రపుం బలుకు ముత్తములుం బలుమల్లె మొగ్గలుఁ।
మోవి చొకాటపుం జిగురుఁ బూనికఁ గూర్చినఁ గాక మానునే॥ ౩౩॥ గీ॥ ఇపుడు కాక
దీఱ నెందైన నారసి। గొబ్బున నుగడంగి కూర్మిచిలుక। వెలయు పంచదార పలుకులు నీ
కబ్బఁ। జేయవలయు నేమొ చెప్పుమయ్య॥ ౩౪॥ వ॥ అనినం గూరిమి చెలికాని నేరుపు
మాటల చేత నాతండు చిలుకకుం దనకు నడచిన నుడువుల చందంబును దన డెందం
బొక్క చక్కెరబొమ్మపయిం దగిలి మక్కువం జిక్కియున్న తెఱంగును నెఱింగెనని
తలపోసి తెంపుచేసి యింక నెయ్యునికడం దన యుల్లంబులోని కోరిక చెప్పక కప్పి
పుచ్చుట కర్జంబు కాదని యెంచి వెంటవచ్చినవారి నెల్లర నాయా పనులు చెప్పి సాగ
నంపి మంతనంబున సంగడికానితో రాచిలుకలు వచ్చినది మొదలుకొని నేఁటిదనుకం
జరగినదంతయుం బూసగ్రుచ్చినట్టుగాఁ దెలిపి యిట్లనియె॥ ౩౫॥ ఉ॥ ఇట్టుగనుండె
నా తెలివి యొల్లనిఁ జేమని తిట్టుకొందు నాఁ।డట్టులు ప్రేముడిం జిలుక యా చెలి సుద్దులె
తెల్పుచోఁ జెవిం।బెట్టక యారకుంటి నిటుమించిన దాని నెత్రవ్వకొంచు నేఁ।డిట్టలు
కమ్మవిల్తు విరియేటులు నాఁటఁగనుంటి నక్కటా!॥ ౩౬॥ ఉ॥ గుట్టునఁ జేడె వీడఁ గ
గోరిక లీరికలెత్తి నూరికిం। దొట్టిన యంతఁ బంతమున దోసపు సిగ్గొక టడ్డువచ్చనఁ।
గట్టిగ నూరు నొక్కఁ దమిగన్పడనీయక కట్టిపెట్టి యా।పట్టున రాచనీటు గనుపట్టఁగ
పట్టిమెఱుంగు వెట్టితిఁ॥ ౩౭॥ ఉ॥ ఏనపుడంతయు న్వినియు నిట్టటు పల్కక యూర
కుంట యే।మో నగుఁబాటుగాఁ దలఁచి ముందర నెద్దియుఁ బల్కఁగొంకి నా।యానతిఁ
బొందిచిల్క చని యవ్వల నెల్లి దమైతినంచ యో। తా నెదఁ జిన్నవోయె నొక వా యిఁక
దానికి నేమి సేయుదుఁ॥ ౩౮॥ క॥ అనిమిగుల వగలఁ బొగిలెడు। ననుఁ గుం జెలికాని

లోనియలజడివోవన్ । జనువున మాటలుచెప్పుచుఁ । గొనిచనియె విశారదుండు కొం
డొకయెడకున్ ॥ ౩౯॥ క॥ అటునెయ్యునిఁగొని చనుచున్ । దటుకునఁ జెలికాండ్ర
కెల్లఁ దగుపనుతెలమిన్ ।దిటవుగను జెప్పి వారల। నటునిటువడిఁబంపివేసి యక్కఱ దోఁ
పన్ ॥౪౦॥ వ॥ ఇంతంతనరాని సంగడికాని వలపంతం దలంచి తలపంకించి మరునిమీఁదఁ
గినుకవొడమె॥ ౪౧॥ గీ॥ మూఁడుకన్నులవానితో మొనసియున్న । చచ్చిబ్రతికియు
వలఱేఁడ చలముతోడ। వేయికన్నులదేవర బిడ్డమీఁది । కేమొగంబునవచ్చితి విపుడు
మరల॥ ౪౨॥ గీ॥ అనుచుమరుదూరి ముందుచేయంగవలయు। కర్జమెదలోనఁ దలపోసి
కాంచియొకటి। మదికిసరిపడ్డపిమ్మటఁ బొదలువేడ్క । సరగఁగ్రీడికిట్లనియెవిశారదుండు॥
౪౩॥ సీ॥ ప్రముచ్చులచేనల్ల పుడమివేలుపునిన్న నావును గోల్పోయి యాఱటమునఁ।
దనయావువిడిపింపుమనుచు నీయొద్దకుఁ బరువెత్తుకొనివచ్చి పలుఁదెఱఁగుల । వేడిన
నాతని విన్నపంబాలించి కనికరంబున మదికరఁగఁబాఱఁ । విల్లుతెచ్చుటకును వెడలి
పరాకున నన్నద్రోవదితోడనున్నతఱిని। బడకయిలునీవు వడిఁజొరఁబాఱుతతన।మున్న
మీలోన మీరుచేకొన్నయట్టి। కట్టుపాటున నొక్కయేడట్టెనీవు । పుడమివలగొని తిరు
గంగఁ బూనలేదె॥ ౪౪॥ క॥ ఈపంద్రెండునెలలు నే।నోపికనీతోడఁదిరిగి యొక్క
టవినమే।నాపడఁతుకయీరారసి।యేపగిదినినైననీకు నింతినిగూర్తున్ ॥౪౫॥ గీ॥ ప్రతిన
కడచనునంతదాఁకఁబదిగనీవు। తమకపడకుండనెట్లైనఁదాళుకొమ్ము। పిదపనీకోర్కెపండిం
తుమదినినమ్ము। మనుచునోడఁబడఁగాఁజెప్పి యతనిఁగొనుచు॥౪౬॥ గీ॥ చనియెరాచనగ
రికి విశారదుండు। క్రీడిపయనంపువేడుక క్రేళ్లదాఁటు। నెప్పుడెపుడంచు నిముసంబె యే
డుగాఁగ। నుండెఁజిత్రాంగదయుఁదనయూరియందు॥౪౭॥ ఉ॥ ద్రోవదిపెండ్లియప్పు
డొకలూపుసమచ్చెపుజంత్రమేసెనం।చావలవీరువారునటనాడికొనంజెవులారవిన్నదౌ।
గావుననాటనుండి మదికప్పుడియందునెనిల్పియుంట సం।దైవిరివింటిదంట యలరమ్ములు
చిమ్మెను గొమ్మ ఱొమ్మునన్॥ ౪౮॥ గీ॥ ఇంతతెఱఁగంటి దొరపట్టి నెదనునిలుపఁ।
దనకుఁ దెఱగంటితనమబ్బెననఁగ నపుడు। విడిచెనిద్దుర తిండియు నుడిగిపోయె । ప్రొద్దు
లెంతయుఁ బడఁతికిఁ బొడవులయ్యె॥ ౪౯॥ గీ॥ నిదురలేకుంటఁ జెమ్మటనిండుటయు
ను। వెలసిమానిసితనమును వేల్పుఁదనము। నెపుడునెమ్మెనఁగాన్పింపనెల్లతఱిని। గాంచె
నరమోడ్పు ఱెప్పలంటి కన్నుదోయి॥ ౫౦॥ సీ॥ పువ్వులుముడువదు పూబోడియయ్య
వి తావవిందునన్లని తూపులనియె । యద్దంబుఁజూడదు ముద్దియఁదానఁ గన్పడుమో
ము మున్నీటిపాపయనియెటు। కురులుచేముట్టదు విరిబోడియయ్యవి క్రొవ్వాఁగుబొమ్మెద
గుంపులనియె । చెలులపల్కులు వినదెలనాగయవియెల్లఁ జక్కెముత్తంబుల పల్కు
లనియె। యంతకంతకు వలవంతవింతదోప। మరుఁడుపూముల్కులడరించి కరము నేప।
నెడదఁగవ్వడిపయిఁగోర్కె యేపుచూప । సన్నగాలియు నెమ్మెనిచెమ్మమాప॥ ౫౧॥
చ॥ చెలులనుమాటికింగదముఁ జిల్కలఁబల్మలునీసడించు నం।చలఁదఱుముచున్ నెమళ్ల

సొగసారెకుఁ బాఱఁగఁదోలు గంతుఁగో|యిలపలుకుల్ వినందలఁకు నేఁచికలంచును గోరువంకలన్|గలికిమదిం గడింది వెతగల్గిన రోతలుగావె యన్నియున్॥౫౨॥ గీ॥ బోటి నెమ్మెను బంగారపూఁటనపుడు| కమ్మవిల్కానిచిచ్చునఁ గరఁగుచున్న| దోయనంగ పైఁ జెమ్మటమొప్పుమీఱి| వెల్లువగుచును బాఱెను బెల్లుదనరి॥౫౩॥ సీ॥ ఆవెల్లతత్తడి యతఁడొడల్పేర్పక నెలనువెండ్రుకఁ గట్టఁ జాలకనగునె| యల్లమానినిసింగ మక్కునఁ జేర్పక యించువిల్తుని బెదరింపనగునె| యాపజదారచక్కనౌ మోముదార్పక కొదమరాయంచలోఁ గొనఁగనగునె| యల్లజగముచుట్టమలరించియేలక తుమ్మెదదిమ్మపై గ్రమ్మనగునె| యనుచునయ్యింతి సగమగునంతకంత| కొగినిలిచినచోట నిలువకుండుఁ దెల్లఁ|దనముపూను వెన్నెలకును దలముడుంచుఁ| దలిరువిల్కానికాఁకకుఁ దాళలేక॥౫౪॥ గీ॥ చిగురుబోడికిఁ గోయిలల్ పగవియయ్యె| కొమ్మకెంతయుఁ దెమ్మెరపూళ యయ్యె| నలరుబోడికిఁ గిట్టనివయ్యెఁ దేంట్లుఁ| దమ్మికంటికి రేఱేఁడు దాయయయ్యె॥౫౫॥ చ॥ మరునకుఁ దూపునేసరయ మామవునీవుసుగానసట్టిచో| నిరువురకిట్టి వట్టిపగ యేటికిఁ బాటిమొయంచుఁ దెల్పి చం|దురుమదిదేర్ప నాతనినెదుర్కొనఁ దామరచేరెనో యనన్| దరియఁగఁ జేర్చెఁ జామచెయి దామరచెక్కునవెచ్చనూర్చుచున్॥౫౬॥ ఉ॥ కన్నులకాటుకంగలసి కల్కిచనుంగవమీఁదఁ జిందు వా|ల్గన్నులనీటితుంపరల గారవమొన్నఁగనయ్యె నయ్యెడన్| జెన్నెసలారుతామరల చెల్వవుఁ దేనియలానియంతటన్| గ్రొన్ననగుత్తులంగదియు కోరికనేగెడు తేఁటులోయనన్॥౫౭॥ ఉ॥ పుత్తడిచాయ మోమునకు ముక్కునకత్తికిఁ జెక్కుఁ దోయికిన్| బొత్తుగవెల్లఁదమ్మినపుఁబువ్వను జందమునిగ్గుటద్దమున్| గుత్తగఁ బోల్చి కబ్బముల కూర్పరులాడినమాటచెల్లెనా|చిత్తఱఁ జానపేను తెలుపెక్కెను బువ్వులుకానికాకలన్॥౫౮॥ ఉ॥ అప్పుడు ముద్దరాలి వెతమారనిసందియమొంది నెచ్చెలుల్| మెప్పొదవంగఁ జేరఁజని మేకొనియించుక పట్టిచూచి కే|ల్చిప్పలమీఁదఁబెట్టినటు నెట్టనఁ దోచిన నుల్కుచెంది యా|యొప్పుల కుప్పతోడఁ జెలులాక్కట నిట్లనిరుమ్మలంబునన్॥౫౯॥ వీనదోయికిఁ జాల విందు సేయుచువీణె మెల్లన కొనగోట మీటవేమి| ముద్దుపల్కుల నింపుపుట్టంగ నెప్పుడుఁ బెంపుసుచిల్కలఁ బిలువవేమి| యఱచేతఁ జప్పటల్ చఱచి హెచ్చరికతో నింటినెమ్మళ్ళ నాడింపవేమి| చవితిచందురుదూరు చక్కనినుదుటిపై తేటకస్తురిబొట్టు దీర్పవేమి|కలికి రాయంచబోదలగారవించి| తీరుగానెన్నడల్ తగదిద్దవేమి| మేలిమిపసిండి క్రొంజాయ మీఱఁజాలు| మేన నాడెంపుఁ దొడవులు పూనవేమి॥౬౦॥ గీ॥ మగువ నీతెఱఁగేమియో మాకుఁ జూడ| వింతగాఁ దోచుచును గడువెఱపు గొలుపు|చున్నదిదె వేడుకొనెదము నిన్నెమము| చెచ్చెరను నీదుమదివంత చెప్పవమ్మ॥౬౧॥ గీ॥ ఎంతవేడిన మదివంత నిగురుబోడి| సిగ్గుపెంపునఁ జప్పునఁ జెప్పలేక| యుల్లమల్లాడఁ దలవంచి యూరకున్న| మఱియు నిట్లనిరప్పుడామగువలెల్ల॥౬౨॥ ఎట్టిగుట్టును మాతోడనిట్టదనుచుఁ|

బిలిచిచెప్పకుండిన నేము పెద్దయొట్టిటంచు బాసఁజేసియు నిప్పడకటమఱుఁగు వెట్టఁ
దలఁచుట మిక్కిలివింతయయ్యె॥ ౬౩॥ క॥ మనలో నిట్టివిగలవా యని మఱిమఱి
మెడలువిఱువ ననుఁగుంజెలితో మనమునకొన్నదియిచట నె కనికరమెనయంగ మఱు
వఁగావలెననుచున్॥ ౬౪॥ గీ॥ అల్లద్రోవది పెండిలియపుడు క్రీడి చేసిన కడిందిపను
లును వాసిగన్న యతనిచెలువంబుఁ జెవులార నాలకించు కతనఁ దనడెందమొక్కటి
నతనిమీఁద॥ ౬౫॥ క॥ తగులు బెఱఁగించి యిప్పటి దగు తన తెఱఁగెల్లఁ దెలిపి యనుఁ
గుంజెలియం దగమణిరేఖంగనుఁగొని తగులుపడంగను నెలుంగు దానిట్లనియెన్॥ ౬౬॥
చ॥ కలుగునులేదొ కన్గవకుఁ గన్నులవిల్తుని నేలఁజాలు వేల్పులదొరపట్టి చక్కఁద
నముంగని పొంగెడు నట్టిమేలులోఁ దలఁపఁగ నావలెన్మిగులఁ దక్కువనోములు
నోచినట్టి కన్నెలకది పైపయింగలుగు నే యడియాసలుగాక తొయ్యలీ॥ ౬౭॥
క॥ ఎక్కడినే నెక్కడి కేడుక్కున నను గారవించు నతఁడనుకొనియుం టెక్కడ
యీవలపుఁగడలి నెక్కటి నేనీఁదుకేడ యీవేసటతోన్॥ ౬౮॥ ఉ॥ ఎవ్వరిఁబం
పుఁదానఁ జనియిప్పుడు చెల్వునితోడనా వెతల్ నెవ్వడివిన్నవించి తన నేరుపుచూపి
మదింగరంచఁగా నివ్వలవంత నెక్కరణి నీఁగుదునక్కట చిక్కులైననుం దవ్వుల కేగ
కిట్టియెడను దాపుననుండిన నన్నుఁగాచుఁగా॥ ౬౯॥ క॥ అనుచుండఁ దలఁపులోననె
చనుదెంచెను జిలుకకవయుఁ జవలుననటకున్ విని యక్కచప్పుడొక్కట నను గుం
జెలులెల్ల నుప్పలార్పకచూడన్॥ ౭౦॥ గీ॥ చేరవచ్చి చిత్రాంగద చేతిమీఁద వాలి
ముద్దిడి నేమంబువరుసనడిగి పలుకువెలఁదుక తమ్మియ్యఁబంచినట్టి యోగిరముఁ గుల
క్రొవ్విరులెలమినిచ్చి॥ ౭౧॥ చ॥ నలువజగంబునందలి వినందగువింతలు కొన్నితెల్పి
యావల దమ కూర్మినెచ్చెలిని బాఱఁగనుంగొని యామె మేను మిక్కిలి వసివాడి
యుండుటయుఁ గీడ్పడిమోమునఁ దొంటితెల్వి యిమ్ములఁదిలకింపరామియును ము
న్గల సంతసపాటులేమియున్॥ ౭౨॥ క॥ కనిపెట్టి డెందమందున వనటందిగులొంది
తోడివారల నెలమిన్ ననబోడి యట్లుచిక్కుటకును గతమడుగంగ వారు కూరిమి
మీఱన్॥ ౭౩॥ ఉ॥ మున్నలమింటిమీను నొకముల్కిని గూలిచి క్రీడి ద్రోవదిన్
గొన్నతెఱంగు జవ్వనులకుం గడు నాసలుగొల్పురూపునుం గన్నది వేయినోళ్ళ ముదు
కల్గొనియాడఁగ నాలకించి యీ యన్నులమిన్న పొంగి మొదయాతనిపై నెలకొల్పి
నెవ్వగన్॥ ౭౪॥ క॥ కుందుచు నెవ్వరితోఁ దన డెందంబునకోర్కి వెల్లడింపక లో
లోవంతురి యంతంతకుమెయి యందముచెడి సన్నగిల్లి యలసగమైనన్॥ ౭౫॥
ఉ॥ తత్తరమొందిదీనికిఁ గతంబెఱిఁగింపఁగదమ్మయంచు నేమిత్తఱి వేయిచందముల
నీమెను వేఁడిన నెట్టకేలకున్ బిత్తఱి యంతయుం దెలిపి బేలతనంబునఁ బల్కులాడి
తా నుత్తలపాటుతోడ మిము నొక్కటఁ బేర్కొని మీరలుండినన్॥ ౭౬॥ క॥ తన
కిమ్మెయిఁ గడుతోడయి పనిపూనికడిందికోర్కి పండింత్రుగదా యని వేచియున్నదిదె

మున్ననమీచెలి నప్పగించినారము మీకున్॥ ౨౭॥ ఉ॥ మా బరువంతయుం దొలఁగె
మా చెలియన్నిముఁ గూర్చినార మిం।కీబలితంపుఁ గజ్జమెటు లీరలుదీర్చెదరో నుడీయు
నన్ ।జాబిలి చల్వచూపులను జామనుగన్గొని మంజువాణి గా।రాబముమీఱ నిట్లనెఁ గర
మ్మును దేనియలొల్కఁ బల్కులన్॥ ౨౮॥ సీ॥ మేమిద్దఱము మున్ను మీ యొద్ద నెల
వొందు నలువజిగమ్మున కలరువేడ్క । మింటను జనుచుండి మిట్టలువల్లముల్ చదును
నేలలయట్ల మదికి దోఁప । కుప్పముల్ పల్లెలుఁ గుప్పవోసినయట్లు కనువిందుగాఁగను
గానఁబడఁగ। చెఱువులుమడువులుఁ జిన్నయద్దపుబిళ్ళ లట్లు చూడ్కికిఁ జాలనందగింప।
వేడ్కపడుచును నెడనెడ వింతలెల్ల । నెండవొరులతోడఁ జెప్పుకొం చొక్కచోట।
నూరిపజ్జఁ గడ సింగారమొలుకుచున్న। పూవుఁదోటలో నొక్క క్రొమ్మావి క్రింద॥ ౨౯॥
సీ॥ బవరిగడ్డము వానిఁ బవడంబుఁ గ్రొత్త చెందొవడంబుఁ దెగడు కేల్దోయి వాని। తలిరు
చాయము వాని వలతోనినిండుకల్వలతోనినగియెడు చెలువువాని। తళుకుఁ జెక్కులవాని
తమ్ములమీలముత్తమ్ములనగు కన్నుదంటవాని। తేనెమాటలవాని తేఁటులఁ గప్పుజా తేటల
నగు సిగతీఱు వాని। చెలులతోడను ముచ్చటల్సలుపు వాని। కవ్వడినిజూచి యాసోయగం
బునకును। నచ్చెరువునొందుచును గ్రిందికల్ల డిగ్గి। కంటిమాతనిఁ గన్నులకఱవు తీఱ॥ ౩౦॥
సీ॥ దారలేని దారమోవి దొండపండెన్న నేచిలుకలకొల్కి లోఁదలఁపకుండు। పుడమి దేఁలిక
మేలిబుజము తూడులఁ జెప్ప నేయంచయాన కన్నిడకయుండు । నలతేని మోము
వెన్నెల తేని గొనియాడ నేకల్వకంటి లోనెంచకుండు । నెడయనిపొక్కిలి. మడువు
టెక్కెన్న నే జక్కవచంటిలో నుఱ్ఱిక్కకుండు । నట్టి జెగజెట్టిఁ జేపట్టునట్టి మేలు।
పొదలు నిమ్ముద్దరాలికి నొదవె నేనిఁ। బదిలముగఁ బదియార్వన్నె పసిఁడితోడ। మంచి
కెంపును గూర్చిన మాడ్కి యనుచు॥ ౩౧॥ క॥ తలపోసియతనిఁ గన్గొని। వెలయన్మముఁ
దెల్పికొంచు వెలఁదుకనచ్చోఁ। బలుకుల వెంబడిఁ బేర్కొని। చెలువెల్లను బొగడి మున్నె
చెప్పినదానన్॥ ౩౨॥ క॥ చెప్పినదంతయు నూఁకొని । యప్పట్టున నాతఁడిట్టు నట్టను
ననకా।చొప్పు మఱపించి నేరువు।చొప్పడ వేఱొక్కకతకుఁ జొన్పెను నన్నున్॥ ౩౩॥
ఉ॥ అంతియ చాలునంచుఁ దఱిచూడక యత్తఱి నూరకుండి నా।యంతను బోయితిం
బయనపై నెలవాయన యొద్దఁ బొందితివి । న్నెంతలనల్వ వీటికిని మద్దియ నీమది గొంతి
పట్టిపై । నింతగనిల్చియుంట యొకయింతయు నప్పదు నేనెఱుంగమిన్॥ ౩౪॥ క॥
అనిమఱియు నేమిచెప్పఁగఁ। జనుచిలుకం జెప్పనీక సడలిన తాల్మిన్। గనుఁగొనల నీరు
కారఁగ। ననియెం జిత్రాంగద గడు నడలుప్పొంగన్॥ ౩౫॥ క॥ అక్కటికమించుక
యు లేక కటికితనంబు బూన నగునా యుల్లం। బక్కట క్రీడికి నదియును। నిక్కము
నేఁ జేసికొన్న నెఱదోసమె కా॥ ౩౬॥ చ॥ పసితనమేగి జవ్వనము వచ్చినయంతటి నుం
డి నెమ్మదిన్ । విసువక కోరుచెల్వుఁ డటవేసను నొల్లకయుంట యిద్దియున్ । బస
దఱుగంగ వీనులవినంబడియుం దెగలేక మేనిలో నుసురులు దాల్చెదన్వెతలకోరిచి

యెంతటి దోసకారినో॥ ౮౭॥ క॥ వానింగలయఁగనగునని । యేనెంతో యాస పొంది యున్నాళ్లుండం । గానేటికి నిటులాయెను । వానిఁగలయలేని దొక్క బ్రతుకే తలఁపఁగ॥ ౮౮॥ ఉ॥ ఆసను ద్రెంపలేక యిటులందని ద్రాఁకుల పండ్లకూరకే । వేసర గొంతుసాచినను వీసమువాసియుఁ గూడివచ్చునే । మీసరివారు మెచ్చుకొన మేను తొఱంగెదనమ్మలార నా।యాసలు నేటితో విడువుఁడందఱుఁ గేల్గవమోడ్చి మ్రొక్కెదఁ॥ ౮౯॥ వ॥ అనునంత నబ్బిత్తఱి చెలికత్తెలు తత్తరపడి యింతంతనరాని యుత్తలంబున రంతులు సేయుచుఁ బలువురు పలుమాటలాడి యాబోటి సందలింపఁజొచ్చిన నచ్చిలుకకలికియుఁ దనలోన॥ ౯౦॥ ఉ॥ కైకొనకుండరాదు మనకన్నులయందఱ నేడెపుట్టి తే।పేకడ తేఱువారి మనమెందఱుఁ జూడము చావనంగవే। తే కొని తేరఁగా వలెనె యేనిఁక నుప్పరికించి లోని యీ।వీకనడంపకుండినను వేయిటుపో నెటువచ్చునో కదా॥ ౯౧॥ వ॥ అని తలంచి యామించుబోడిం దిలకించి॥ ౯౨॥ గీ॥ ఏల యీలాగునిండిన యింటిలోనఁ। గుడిచికూర్చుండి పనిలేనిగోడవయొకటి । పైని వేసుక పొగలెదు పడఁతమిన్న। చాలుఁబతివేలువచ్చె నీచలము విడువు॥ ౯౩॥ గీ॥ తానుబోయిన పిమ్మట దేనితోడ । నైనఁబనియేమి తెంపు సేయంగవలదు। తలఁపఁజనునమ్మ నీ యంత దానికిట్టి । వెడఁగుపను లక్కటా యెంతవెఱ్ఱివీవు॥ ౯౪॥ ఉ॥ చానరో పోలుపొందెఱుఁగఁజాలక యారక కుందనేల నెద్దీనె ననంగఁగొట్టమున నీవలిగుంజను గట్టుమన్న నే।మైనను జెప్పఁగాఁదరమె యాతఁడు నాడటు మాఱుపల్కకే।మానినదానికింగతము మన్ననవిన్నను గాక నాకిఁకన్॥ ౯౫॥ గీ॥ అనుడు నాచిలుకలకొల్కి యావలఁజిలుక । చెప్పఁబోయెడు సుద్దిని జివరదనుక । వినెడు వేడ్క యువ్విళ్ళూర వెచ్చనూర్చి। యీవలావలి చెలులతో నిట్టులనియె॥ ౯౬॥ గీ॥ మదికలంకఁజేసి యిది యనంగాఁదగు। నిదియనఁదగదనెడి యెఱుక లేక । యేమియోపలికితి నింతె కాకుసురులు। విడఁవఁదలఁప నంతవెఱ్ఱినమ్మ॥ ౯౭॥ గీ॥ అకట నవ్వుటాలకూరకేయన్నమాట। నిజముగాఁబట్టి యిపుడింత నెలఁతలార । పట్టిపల్లార్చి నామీఁద వట్టి లేని।పోని వాదువేయఁగఁ బాడియానెమీకు॥ ౯౮॥ గీ॥ రవ్వపెట్టక యిఁకనైన రమణిమీఱ । జాలి పొయిఁజిల్క యేదియో పేలిపలుకు। చెవిని వేయంగ నుంకించెఁ జెలియలార। వినఁగ నీరమ్మ మ్రొక్కెదవీనులలర॥ ౯౯॥ వ॥ అనుడు నప్పడప్పడంతులెల్లఁ జప్పుడు సేయక యొప్పులకుప్పయగు నప్పలుఁగుచెలువ యొప్పిదంబుగాఁ జెప్పఁబోవు మెప్పుమాటల చొప్పాలింప వల్లంబులువ్విళ్ళూర నూరకున్న నాచిలుకకలికి కలికిపలుకుల నాచెలువల చెవులకుఁ జవులుగొలుపుచు గిలుకుమెలుంగున నిట్లని చెప్పందొడంగె॥ ౧౦౦॥

సీ॥ అలపూవుఁదోటలోఁ బలుకువెంబడిమున్ను పొలఁతినీరూపు నేఁబొగడినపుడు। వలపుడెందములోనఁ గలిగియుఁగొండత యొక్కింతయును వెలికుబ్బనీక। యగ్గలంబుగఁదొట్టునిగ్గుకతంబున దానినంతయు మదిలోనె యడఁచి। కల్లసుట్టాకయింత కా

స్వింపఁబైటికి నౌనుగాదనుమాట యనకయుండె। నువిదరో యంతెకాని వేఱొండు
కాదు। విన్నము వినిపింతుఁ దరువాతవెఱ్ఱియగుచు। వలపుతలకెక్కి నాతఁడు మొలఁగి
నట్టి। నడతచందమించుక తేటపడఁగనీకు॥ ౧౦౧॥ ఉ॥ నిన్నను నల్వవీడుకొని నే
నరుదెంచుచుఁ గంటిఁ ద్రోవలోఁ। బెన్నకుఁజేరువం గనులవిందుగఁ జెన్నగునొక్కకోన
యం।దున్న గుడారముం దఱిసి యొప్పెడు మామిడిగున్న క్రింద వే।గన్నులవేల్పుపట్టి
చెలికాఁడొకఁడాతఁగఁ గూరుచుండఁగన్॥ ౧౦౨॥ క॥ కనివారేమనుకొందురో। విన
వలెనని వేడ్కఁబొడమి వెసనాలే।మాఁ।కునకుండిగి యొకకొమ్మను।బనివడి నేఁగూరుచుంటి
బడలికవాయన్॥ ౧౦౩॥ వ॥ అయ్యెడ నాకవ్వాడి వెడవిలుకాని యలజడిం దెలివిచెడి
యుదితగు నిదితగదనియెడి యెఱుకలేక యెదుటఁ గనుపడువాని నెల్లం దడవి యిట్లని పల
వింపందొడంగె॥ ౧౦౪॥ సీ॥ అలలార యంచ తొయ్యలులార మీరైనఁ జిత్రాంగదకు
నన్నుఁ జెప్పఁగలరె। తొగలార మేలి సంపఁగులార మీరైనఁ జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁ
గలరె। పొదలార గండుతుమ్మెదలార మీరైనఁ జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁగలరె। విరు
లార చలువతెమ్మెరలార మీరైనఁ జిత్రాంగదకు నన్ను జెప్పఁగలరె। యెంత వేడిన నొక
రైన నించుకంత। పలుకనైనను నాతోడఁ బలుకరేమి। యేను జేసిన తప్పిత మేదియైనఁ।
గలదె యెల్లరు నన్నిట్లు చులకసేయ॥ ౧౦౪॥ గీ॥ నేమమున నేను బం।డ్రెండు నెలలబట్టి।
యిన్నియేళ్ళకుఁజని గ్రుంకులిడినయట్టి। పున్నెముననైన నాకు నాపువ్వుబోడిఁ। గాం
చుమేలైన నొకసారి గలుగరాదె॥ ౧౦౫॥ క॥ అని పెక్కువగలఁదలఁకెడు। ననుఁ
గుంజెలికాని లోనియలజడితగ్గన్। మనమిదె చని చిత్రాంగదఁ। గనుఁగొందము నమ్మి
యెల్లి కన్నులుతనియన్॥ ౧౦౬॥ క॥ అందాకనోర్చుకొమ్మని। కందువమాటలను
జెల్మికాఁడొకఁడచ్చో। డెందమునందలికుందున్। డిందింపుచునుండ నపుడ నేనును
గడఁకన్॥ ౧౦౭॥ క॥ నీయెదయాతనివయినిటు। లోయింతిరో తగిలియుంట యొ
క్కింతయు నే।నాయెడ నెఱుఁగమిచే నీ।చాయలవచ్చితిని నంతెచాలునటంచున్॥ ౧౦౮
క॥ నమ్మమిది నేటపేటఁ। గొమ్మా నిన్నెదకికొంచు గొబ్బున ఱేఁడీ। యిమ్మున కేతెంచి
నినున్। నెమ్మింజేపట్టునీదు నెచ్చెలులలరన్॥ ౧౦౯॥ గీ॥ కాన నూఱడియుండుము
నేనుబోయి। యిపుడ మీతల్లిదండ్రుల కెలమిమ్రొక్కి। వారినేమంబు లారని వత్తుమ
రల। ననుచుదిగ్గున రాచిల్క లరిగెఁజదల॥ ౧౧౦॥ క॥ చిలుకలటుచన్నపిమ్మటఁ। జెలి
కత్తియలంతిపురికిఁ జెచ్చెరఁజెలువన్। బిలుచుకొనిపోయిరూఱడఁ। బలుఁదెఱఁగుల
దిటవుగఱపి పాయనికూర్మిన్॥ ౧౧౧॥ వ॥ అటుతరువాత నడచినకత చెప్పమని
జనమేజయుం డడుగుటయు॥ ౧౧౨॥ మాలినీవృత్తము॥ జగము లరయువాఁడా
సాదులం బ్రోచుఱేఁడా। పొగరుఁ బసులగొంగా పూపబల్వెన్నదొంగా। పగయెఱుఁ
గనివేల్పా పైడిపుట్టంబుదాల్పా। వగలుతొలఁచుమిన్నా వానిగన్ గొల్లపిన్నా॥ ౧౧౩॥
కందగర్భిత మణిగణనికరము॥ చిలువదొరపఱపుచెలువునఁ, జెలగఁగన్। సిలుగుల నడ

చెడు * సిరిచెలిమగఁడా । నలువయుఁగొడుకయి నలువుగ, వెలయఁగ । బెలుకుఁబం బగతుర * బిగిచెఱుచుదొరా॥ ౧౧౪॥ గద్యము॥ ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరి వంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబయిన రసికజన మనోరంజనంబను ప్రబంధరత్నంబున ద్వితీయాశ్వాసము॥



# రసికజనమనోరంజనము.

## తృతీయాశ్వాసము.

క॥ సిరియుం బలిమియు నేమముఁ దిరముగ మదినమ్మికొలుచు దిట్టలకెల్లన్। గరము న్నెనరుననిచ్చుచు । నరయుచు సాధులనుబ్రోచు నలకరివేల్పు॥ ౧॥ వ॥ వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పందొడంగె నట్లు చెలికత్తియలు పొత్తుగ నత్తెఱవం గొనిచని మనికిపట్టుచేర్చినఁ జేర్చిన మరుచిచ్చునకుఁ దాళఁ జాలక చాల జాలిం దూలుచు వారలనేమరించి॥ ౨॥ సీ॥ అలమోవి దొండపండని వచ్చు చిల్కల జవ్వాజివలపులు పడలఁద్రోయ । బుజము తూండులఁ జూచి పొరివచ్చునంచలఁ జరముక్రొమ్మొగిలింత తోలఁగఁద్రోల। చనుపూవుబంతులఁ గనివాలు తేఁటుల ముక్కు సంపఁగిమొగ్గ మొనసితఱుమ। కయికొమ్మల నదల్పఁగా వచ్చు తెమ్మెరనొకట నూగారు పాముదుగఁ జేయ। కలికిరూపున గనిచేఱుకమ్మవిల్తు। బలఁగముల నాకలికిరూపె పాఱఁ జేయ । బోటివెడలెను బూవులతోటకపుడు । చెలులదిగనాడి యెడఁబాటు చెలువఁ గూడి॥ ౩॥ గీ॥ అంతనింతులెల్ల నెంతయుఁదలఁకొంది। యింటఁజెలిని గాన కెల్లచోట్ల। వెదకి తత్తరించి వెలఁదులుత్తలమున। నలరుఁదోటఁజేర నరుగుదెంచి॥ ౪॥ చ॥ కనిరెల దోటలో వలపుగ్రమ్మెడు తమ్మికొలంకువంకఁ జక్కనినదేనె యేటిచిఱుకాలువ కావలిమావిక్రేవఁ బన్నిన నెలఱాలమేలిపని నిద్దపుముద్దుటరుంగుచెంగటన్ । బూనరిన కమ్మచెంగలువ పుప్పొడి తిన్నియమొద్ద ముద్దియన్॥ ౫॥ వ॥ కని యిట్లనిరి॥ ౬॥ చ॥ ఎటువలెమమ్ముఁబాసి యిపుడిచ్చటికొంటిగ వచ్చితమ్మ నీ।వెటువలెఁ బూవునీటి పెనువెల్లువలీదితివమ్మ నీదు కా।ళ్ళెటువలె నొర్చెనమ్మ వెలదీ యిటు పుప్పొడితిన్నెలెక్క నే।డెటువలె దూరితమ్మ పొదరిండ్ల నయో తగునమ్మ యిప్పనుల్॥ ౭॥ ఉ॥ నీ చెయిదోయి కెంజిగురు నీనునువాతెఱ దొండపండునన్ । నీచనుపూవుగుత్తులును నీచెలువారు బుజంపుఁగొమ్మలున్ । జూచినఁగోయిలల్ చిలుకజోటులుఁ దుమ్మెద చాలుఁ దెమ్మెరల్। హాచెలి యించుకైన నిను నాఱడిపెట్టక నిల్వనిచ్చునే॥ ౮॥ సీ॥ ఒడలెఱుంగక మరుఁదుండి మండిపడును గూడితేఁటులు కొఱకూతలఱచు । వదరుచుఁ జిల్కలు వడిఁబండ్లు కొఱుకును పరువెఱుంగక యంచఁ బారసాచు। కదిసికోయిలపిండు కన్నులెఱ్ఱగఁజేయుఁ బాగరునగోర్వంక లెగిరిపడును । మొయిజల్లుమనగాలి మీదిమీదికి వచ్చుఁ గన్నుగానక నెమ్మిగంతులిడును। గోలతనమున బలుముద్దరాలవగుట । వచ్చితివిగాక యొకులిట్లువత్తురమ్మ । యించువిలుకాని దడములకిక్కయైన । కాఱుకోనకు నొంటిమైఁ గలువకంటి॥ ౯॥ సీ॥ సారెసారెకు వీచు చలుతెమ్మెరకాదు తియ్యవిల్తని వాని తేరుగాని। యలచెట్లనలరించు నామనిదొరగాఁడు పచ్చవిల్తుని దళవాయిగాని।

పరువులెత్తెడు గొఱవంకగుంపులుగావు తలిరాకువిలుకాని దండుకాని । తావి గుబు
ల్కొను తమ్మిమొగ్గలుగావు కమ్మవిల్తుని తూపుగములుకాని । తేనెలానివెడలు తేఁటి
పాటలుగావు । మొనయుమరుని నారిమ్రోఁతగాని । కెలనవిరియు కన్నెగేదంగి పువు
గాదు । పూలవిల్తుచేతివాలుగాని॥ ౧౦॥ వ॥ అనిచెప్పనప్పు డప్పడంతుక కంతకంతకు
వలవంత వింతయయి చూపట్టి నప్పట్టునఁగల వింతలుచూపి వంత మఱపింతమని యెం
చి మించుబోం డ్లమ్ముద్దరాలిం బూలుగోయుదము రమ్మని తోడుకొనిచనుచునిట్లనిరి॥
౧౧॥ ఉ॥ అల్లదె చూడుమోముగువ యాదెసఁ దెమ్మెరపేరియెమ్మెకాఁ।డల్లనఁదీగ
పైదలి యొయ్యారపుమంచు పయింటఁబాపినన్ । మెల్లనపూవుగుత్తులను మేల్చనులా
తలిరాకుచేతులన్ । బెల్లుగమాటఁగాఁదివిరెఁ బెంపగునిబ్బితి యట్టిదేకదా॥ ౧౨॥
చ॥ చిలుకలకొల్కి కన్గొనుము చెన్నగుతీవియఁ జిల్కకొట్టచే । నలరుచుదొండపండు
దనరారెడు డెందమువాంఛఁ జెల్వనిం । గలసినవంటినొక్కులను గందియు ముద్దులు
గుల్కుచున్న యు।గ్మలిచెలువంపు కెంబెదవికైవడిఁ గ్రాలుచునున్నదెంతయున్॥ ౧౩॥
చ॥ కనుఁగొనుముద్దుగుమ్మ సరగన్ గనుఁ గల్వలువిచ్చియుండటన్ । జనిచని నెమ్మిగొండ్లి
యటుసల్పఁగఁజాగెను బువ్వుఁదేనియల్ । గొని పొగరెక్కి తుమ్మెదలు గుంపులుగూడి
చనంగదవ్వులన్ । గనుఁగొని నల్లమబ్బనుచు గ్రక్కున లోఁదలపంగఁ బోల్పమీ॥ ౧౪॥
ఉ॥ అక్కడఁగోయిలొక్కటి రవంతయుఁ బల్కుటమాని యాకులే । మెక్కుచుఁ
బెక్కునాళ్లు గుఱిమీఱఁగఁ గానమునిల్చియెప్పుడు । న్నిక్కపు మావిలేఁజిగురు నిప్పన
నొప్పుచుఁదమ్మికంటితాఁ।జక్కఁగఁగైకొనెం దబినిచందము నీనుడిమెచ్చువాండఁగన్॥
౧౫॥ చ॥ కరువలిపిన్నమెల్లఁజని కమ్మనితావులు గ్రుమ్మరించు న।బ్బురపుఁ గొలంకుఁ
జేరు తనపోకకునడ్డయి నిల్చియున్న యా।దరిబలురక్కసుత్తులఁకఁ దద్దఁ దలల్డును
మాడిమ్రేల్మిడిన్ । విరులనుద్రుంచి కొమ్మకును వ్రేఁగుతొలంచెను గంటివేచెలీ॥ ౧౬॥
గీ॥ అలరుకొమ్మలు చెలువులనల్లఁబొంది । కొమరుపూపలఁ గాంచెనో కొమ్మచూడు ।
మలరుకొమ్మలు చెలువులనల్లఁబొంది । కొమరుపూపలఁగాంచుట గొప్పయగునె॥ ౧౭॥
వ॥ అని మఱియును॥ ౧౮॥ సీ॥ ఏమనవలదేఁడు ప్రేముడిపుట్టంగఁ గలసిడెందంబు
లో మెలఁగునమ్మ । చెలువలదేఁడు నిచ్చలు వేలుపుల్త్రోవ విడిచి యావంతయు
నడువఁడమ్మ । నెలదోటలోని కోయిలమొత్తమేతఱి నోరెత్తిమాటాడ నోడునమ్మ ।
జింకతత్తడిరౌతు చెలఁగియొకప్పుడు నొకరికంటఁబడకయుండునమ్మ । తెల్లవాఱుతడవ
యంచలెల్లవిడువ । కెంతదవ్వైన వినువాఁకకేగునమ్మ । యట్టివారలచే నెగ్గుపుట్టు
టెట్లు । వలదువలవంత యొకయింతవారివలన॥ ౧౯॥ చ॥ మొగిళులఁజూచిసంతసముఁ
బూనునెమళ్లను నంచపిండు, సం।పఁగిపువు తావులంగొనెడి పయ్యెరతుమ్మెదదిమ్ము,
తమ్ములం। దగిలికలంచుజాబిలియఁ దామరచాలు, పొసంగిమన్కి యో।ముగుదరో
సాగదేఁగొని ముందుమరుండరుదెంచునీపయిన్॥ ౨౦॥ సీ॥ నీకంటఁబడినేలనిలుచు

నే మఱుడాలు నిలువు గ్రుడ్లుపడి తానీరుచొరక। నీమాటవిన్నఁ దానిలుచునే మఱుతేజి తోకత్రెంచుక కానఁదొలఁగిచనక । నీమోముగన్నఁ దానిలుచునే మఱుమామ దిగఁ జిక్కి బయలునఁ దిరిగిచెడక। నీచేతఁబడ్డఁ దానిలుచునే మఱుబాకు వడఁకి క్రూఁకులనంటి పట్టుకొనక। మిట్టిపాటుచు నెగరిపాటట్టలంపుఁ । ద్రిమ్మరితనంబుఁ గఱకుతనమ్ము మాని। మునిఁగి డాగి పఱచి కూలి చనియె నేని । యెంతమండిపడిన మఱుఁడేమి సేయు॥ ౨౧॥

చ॥ దరిచెడి కానపాల్పడియె దండులు, తూపులువిచ్చిపోయెఁ, చేరరుదగమూలపట్టెఁ, జెలువారు సిడంబులు నీటిపాల్పడెన్। విరివిరిపోయె నారియును, విన్నగదాలుపు కంటి మంటలన్ । మఱుఁడు ననీల్గెఁ గొందలము మూనుము పూవిలుకాని డాడికిన్॥ ౨౨॥

వ॥ ఇట్లు నెచ్చెలులెచ్చరించుచుఁ దోడుకొని చనుచు॥ ౨౩॥ వృషగతిరగడ॥ కలికికలికి మొగంబులం గదుఁగప్పఁగప్పరపుందుమారము। పలుకుపలుకులుగాఁ జనకంటివంకవంక రగఁజన నేరము । పొదలుపొదలు డాయఁబోక ననుబోటిబోటిగమి వెన్క నడువు । మొదలమొదల వెఱపుదోప నిట మేలమేలకను పెద్దనడువు। కానకానవ యేబుదటేయకు కన్నెకన్నెఱఁజేసిచూడకు। మానుమానును గుట్టునివ్వెఱ మాటిమాటికి పమ్ము వీడకు। కొమ్మకొమ్మలపండులెల్లను గోయఁగోయని కూయఁజిల్కలు । నెమ్మినెమ్మిని జూడు మల్లడె నీడనీడను దానికుల్కులు। చెలువచెలువగు పువ్వునీరొగిఁ జిలుకఁ జిలుకరాలి చెంబూలను । నలరు నలరులురాలెఁ గన్గొను మన్నమన్నన సేయవేలను । దనరఁ దనరవ ణములూడ నెఱతావి తావిదిరమ్మని చెలికి । ననుచు ననుచు చేమంతిపొదకు నల్లనల్లనఁ జనె నొకకలికి । మంచిమంచిసుమంతకప్పిన మావిమావిడిది మున్నెప్పుడు । మించు మించులబోడి పోవమె మీదమీదడయఁగ నిప్పుడు । తెఱవ తెరువది తిన్నగాఁజని తేని తేనియ వాఁకతాఁకదు । నెఱయు నెఱయుప్పరిగవేడుక నించు నించుక కాకసోఁకదు। పొగడపొగడఁదగి తావులననబోడి పోడిమిమీఱఁ గ్రాలెను । పగలుపగలు మొగముతో నెఱపి వాడివాడిమిఁ దమ్మితూలెను। నెన్నెన్నఁడు గొజ్జఁగులపూవింత వింతగలేదు డాయుము। కన్నెకన్నెగేదఁగి క్రొన్ననఁ గడఁకఁగడకన్నెత్తికోయుము। కొనకకొనకటు లేల చూచెదు గోరగోరఁట పూలు ద్రుంపవె । మొనయు మొనయరియాడు సంపెగ మొగ్గమొగ్గకకేలనింపవె। యేలయేలకిపొదవిరిమొత్త మెల్లమెల్లన రాల్పఁజాలవు । గోల గోలనుగొంచు నాకలిగొట్టుఁగొట్టుము నేలపాలవుఁ। జాలజాలగు కాల్వదరిఁజనఁ జాగి జాగిటు చేయనేటికి। నాడ నాడుకోయిల యిపుడేమఱచె మఱచెనీనుడినేటికిఁ । జాన జానగు తావితావెదఁజల్లఁజల్లని బావిఁగందము। పూనిపూనికలెల్లఁదీఱఁగ మొల్లమొల్లపుఁదావిగొందమె। యలసియలసిగపూలురులఁ జటియందయందఱుఁ గూరుచుందురె। వెలయ వెలయనరాని కొలంకు వేడి వేడితొలంచుకొందురె॥ ౨౪॥ సీ॥ అడుగుల కెంజాయ లలముపట్టులు చూచి తలిరాకుపడెనంచుఁ దలఁచి వంగి । తనచూపుచాలు పర్విన పూలఁబేంట్లని చాచిన కెంగేలు సరగఁదీసి । తగఁబజ్జరుసతెల్పు జిగివర్వు తీగెల

మల్లెమొగ్గలటంచు గిల్లఁబోయి। మొడలిబంగరునిగ్గు లడరుమ్రాఁకులఁజూచి సంపెంగ
ననలంచు సరసఁజేరి। ముండ్లోరుల నవ్వుకొంచు నయ్యువిదలెల్ల। విరులుకోయంగఁ
జొచ్చిరి వింతమీఱఁ। గలికినడకల నంచల గరువమడఁచి। యందియలు కాళ్ళ గళ
గళ్లుమనుచు మ్రోయ॥ ౨౫॥ గీ॥ చిగురుటాకులు వడిఁద్రుంచెఁ జెలువయొకతె। యపు
డ చేతులకనిదీయునట్లుగాఁగ। మల్లెమొగ్గలవెసఁద్రుంచెమగువయొకతె। యలుకమెయిఁ
బంటఁ బగపట్టినట్లుగాఁగ॥ ౨౬॥ సీ॥ వడిఁబొన్నవిరిగోసి యొకఁబెట్టెనొక్కతె పొ
క్కిలితో సరిపోల్చుకరణి। వెసఁగోసిసంపంగివిరినిమూర్కొనెనోర్తు ముక్కుతోడను
సరిపోల్చుకరణి। చిగురుజొంపముద్రుంచి చేతఁదాల్చెనొకర్తు పాణిఁ గేలితో సరిపో
ల్చుకరణి। మొగిలిరేకులుగోట ముట్టెగిల్లెనొకర్తు మొగిగోళ్ళతో సరిపోల్చుకరణి।
దొండపండునుగొఱికె నాతుకయొకర్తు। పొసఁగఁగెమ్మోవితో సరిపోల్చుకరణి। తీవె
మెయినంటఁ జేయెత్తి తిగిచెనొకతె। పూని నెమ్మేనితో సరిపోల్చుకరణి॥ ౨౭॥ గీ॥
వెలఁదులమ్మాడ్కిఁ జిగురులు విరులుఁగోయఁ। దూలినెవ్వగఁబొంకుచుఁ దోటబోటి।
యొకటఁగన్నీరు నించెడు నోయనంగ। దొడిమెలను నీరుకారంగఁ దొడఁగెనపుడు॥
౨౮॥ వ॥ ఇట్లు పూలుగోసి యలసి సొలసి యమ్మగువలెల్లం జెమ్మటలఁ దొప్పదోఁగి
నెత్తమ్మికొలంకున నీరాడఁగోరుటయు నచ్చిత్రాంగద॥ ౨౯॥ గీ॥ మేలిమగజాలపట్టుల
మెల్లనడిచి। మెఱుఁగులీనెడు రతనంపు మెట్లుడిగ్గి। వలపుగొలిపెడు తామరకొలనుఁ
జేరె। నొక్కనెచ్చెలి క్రేల్దమ్మి యూతఁగొనుచు॥ ౩౦॥ క॥ క్రొవ్వెదనించుకకనుఁగొ
ని। క్రొవ్వెదనించుకయువిడిచి గుంపుగనంచల్। దవ్వులమొయిలని పాఱెను। నవ్వుల
పాలయ్యె కొలఁకుదఱి నవ్వలివలనన్॥ ౩౧॥ చ॥ చెలువలు సొమ్ములు న్వలువచీరెలు
నొడ్డునఁబెట్టిపావడల్। బలుచనుకట్టఁగట్టి సరివారలఁజీరుచు నీరుచొచ్చి రా।పాలఁ
తులకొప్పు ముక్కుమొగముంగని యంచలుఁదేంట్లుజక్కవల్। జళుకున నల్లమబ్బుజిగి
సంపెగచందురుఁడంచుఁదూలఁగన్॥ ౩౨॥ సీ॥ చిలుకలకొల్కుల చేతులు నడుగులు
నెఱ్ఱదామరగుంపు నినుమడింప। ముద్దులగుమ్మల మోములుఁజన్నులుఁ బొందామరల
గుంపుఁ బుట్టఁజేయ। కలువకంటుల వాలుఁగన్నులచెన్నులు వాలుగన్నగమి నిబ్బడిగఁ
జేయ। క్రొవ్విరిబోడుల కురులమొత్తంబులు నాచుతీవెలపెంపు నలువరింప। నెలఁత
లెల్లను గుములుగానీరుచేరి। యింపుదళుకొత్తఁ బెల్లుగా నీఁదునపుడు। చెలువుమీఱిన
నెత్తమ్మికొలఁకునకును। గరమువింతగఁ గ్రొత్తసింగారమొదవె॥ ౩౩॥ చ॥ చెలువ
యొకర్తుకెంజిగురు చిమ్మనగ్రోవి యమర్చి పూవుఁదే।నెలు చెలిమోముదమ్మిపయి నె
మ్మినిజిమ్మినఁ గేలుదామరల్। తళుకుమొగంబుచేరువకుఁ దారుచుటొప్పగుఁ బూవు
నీటికిం। దలఁకకు మేముగల్గనని తమ్ములుబాసటవచ్చె నచ్చునన్॥ ౩౪॥ గీ॥ ఒం
డొరులకేలుదమ్ముల నొక్కమొగిని। నెమ్మొగంబుల పయినీరుచిమ్మటొప్పెఁ। దమ్మి
పూఁదేనియను జాపుఁజుమ్మెదలకు। మించుతమి నోగిరంబుగఁ బంచునట్లు॥ ౩౫॥

క॥ కుంకుమసోఁకఁగ నెఱుపయి। యింకొకయెడఁ బసపుసోఁక నెలవచ్చనయై। పొంకపుఁగాటుకసోఁకిన। వంకనలుపయి కొలఁకు పలువన్నెల నమరెన్॥ ౩౬॥

సీ॥ కప్పుకొప్పులనుండి కాఱుచుండెడునీరు చిఱుతమబ్బుల వానచినుకులట్లు। గబ్బిగుబ్బలనుండి కాఱుచుండెడునీరు బలితంపుమలల పెన్వాకలట్లు। కమ్మమోములనుండి కాఱుచుండెడునీరు సొగసుచందురు మంచుసోనయట్లు। కలికికన్నులనుండి కాఱుచుండెడునీరు నెత్తమ్మిపూవుఁదేనియలయట్లు। వాతెఱలనుండి తగజాలువాఱునీరు। పలుచనగు దొండపండులపాలయట్లు। వింతవింతలఁదనరెఁ గన్పింపుగాఁగ। లేమలటనీటిలోమున్గి లేచునపుడు॥ ౩౭॥

గీ॥ పడఁతిమిన్నలుకొలఁకు వెల్వడెడునప్డు। డొందలనంటిన నీటిబొట్లొప్పమీఱె। నేవళంబుగఁ బెరుగు క్రొందీవగములు। మొగ్గతొడిగిన కైవడి ముద్దుగులుక॥ ౩౮॥

చ॥ తనతల పెక్కలంజూనిపి దాపునసొద్దున నంచ పవ్వళిం।చినఁ గని కట్టుపుట్టమని చేడియయొక్కతె కేలనంట ము।క్కునదిని కేల్వడింబొడువ గుబ్బెత గొబ్బున నుల్కిపాటునన్।వెనుకకువచ్చె దానిఁగని నెవ్వడినవ్విరి తోడిచేడియల్॥ ౩౯॥

గీ॥ ఇట్లు కొలఁకువెల్వడివచ్చి యింతులెల్లఁ। దమ రవణములు వల్వలుఁదాల్చి పిదపఁ। బువ్వుబోడిని నైనేని పూలుదురిమి। పొసఁగ మొగమునఁ గస్తురిబొట్టువెట్టి॥ ౪౦॥

గీ॥ మెల్లమెల్లనె యపరంజిమేడపొంతఁ। బూవుదోఁటను గుజ్జుక్రొమ్మావినీడఁ। జెన్నుమీఱెడు నెలఱాలతిన్నెమీఁదఁ। బొలఁతిఁగూర్చుండఁబెట్టి యాపువ్వుబోండ్లు॥ ౪౧॥

క॥ జాణతనపుమాటల వి। న్నాణముచూపి చెలియమదనాటిన కుందుం। బోనడఁచి ప్రొద్దుపోవఁగ। వీణియఁగొనివచ్చి ముందుపెట్టిన వేడ్కన్॥ ౪౨॥

గీ॥ తీగెలుబిగించి సుతికడుఁదిన్నపఱచి। పూనివీణియను బుజంబుపైనిమోపి। కేలుసవరించి సారెల వ్రేలునిలిపి। యొలమిమీఱ జిత్రాంగదయింపుపుట్ట॥ ౪౩॥

సీ॥ క్రొవ్వాడికొనగోళ్ళ గ్రుచ్చి తంతులుమీటు నందంబు మదిజల్లుమనికలంప। మురిపెంబుగాఁబల్కు ముద్దుపలుంగుల కల్లనఁగోయిల లరుగుదేర। సారములుకలిపించి సొగసుగాఁ బలికించు వింతకు జాలెల్ల వెసఁగరంగ। హొయలుగాఁబాడెడు నొఱపైనపాటకుఁ జేరువమోడులు చిగురుపట్ట। తాననెవ్వడిఁ గవ్వడిపైనిమున్ను। గూరిచిన తేటపాటను గూర్మిమీఱ।వీణెమీదను హాయిగా వెలఁదిమిన్న। వింతగాఁ బాడఁజొచ్చెను వీనులలర॥ ౪౪॥

ఉ॥ అయ్యెడఁగ్రీడి వేడ్కమెయి నచ్చటికింజనుదెంచి మించి యా।తొయ్యలిఁ గాంచుజాడ మదిఁదోచక యారయుచింతలోపలన్।నెయ్యునిఁగూడి యయ్యెడవినిల్చి మెకంబుల వేఁటలాడఁగాఁ। జయ్యననెంచి కొంతవడి సల్పె మెకంబులవేఁట వింతగన్॥ ౪౫॥

గీ॥ ప్రోలిచేరువకానలోఁ బ్రొద్దుగడవఁ। గొంతవేఁటాడి మెగములఁగువ్వగూల్చి।యేటుపడి పాఱిపోయిన యెలుఁగువెంట। నంటిచనుదెంచి యాపాట యాలకించి॥ ౪౬॥

ఉ॥ చెంగటఁబాటపాడుచును జెల్వలతోడను దోటలోనఁ జి।త్రాంగదయుంట జాడ మెయి దవ్వులవారలచేనెఱింగి యు।ప్పొంగుచుఁ జెల్మికానిఁగని పొంధొడఁగూర్పఁగ

మంచిసందిదే । ముంగలఁజేసు చెన్వడిగఁ బూనిక సల్పుమటంచు నిట్లనున్॥ ౪౭॥
చ॥ ఎటువలె నేకతంబచని యింతికడన్ను గానిపించెదో । యెటువలెఁ బల్కరించెదవొ యెట్టుగ మున్న నలందమించెదో। యెటువలె నేర్పు చూపెదవొ యెట్టుగ నూటిగ మాటలాడెదో। యెటువలె మమ్ముఁ గూర్చెదవొ యాయది నీయది సుమ్మి నెచ్చెలీ॥ ౪౮॥ చ॥ వెలఁదులు చుట్టు నున్నపుడు వేఱొకసందడి నున్నయప్పుడున్ । వెలయఁగ నాతెఱంగు కడు వేగిరపాటున ముచ్చటించి యామ్మచెలువకు నన్ను విన్నపము సేయుము మన్నిట జాణవీవు నే। నెలమిని వేఱచెప్పవలెనే తగునట్టులె చేయఁగాఁదగున్॥ ౪౯॥ క॥ ఒప్పుల కుప్ప యపంజను। నప్పడఁతికి నామదిఁగల యలజడియెల్లం। జెప్పి కరంచకయేమో। చెప్పితినని నీవసడ్డచేసెదు సుమ్మీ॥ ౫౦॥ వ॥ అనిన నవ్విశారదుండును నవ్వి కవ్వడితోడ॥ ౫౧॥ గీ॥ ఎంత దేవరపనియన్న నింత లోనఁ । బూని వండించుకొనివత్తుఁ బోసఁగఁ బలికె । యానతియె యన్న నెయ్యంబు గానుపించు । నెలనగవు నవ్వి తలయూఁచి మొగర వైవ॥ ౫౨॥ చ॥ అలయది సన్నగా నెఱిఁగి యాతఁడు సామిహసాదటంచు రెండడుగులు ముందుసాగి మొగమల్లన తేనిదెసన్ మరల్చి చేతులువడి మోడ్చి సంతసము దోఁపఁగ నిచ్చట నున్నయట్టులే । తలఁపుము పోయివత్తునని దారినిసాగెను వేగ నేగఁగన్॥ ౫౩॥ సీ॥ నెలఱాల నేల పజ్జలఁ గ్రాలు గొజ్జంగి పువునీటియేటి వెల్లువలు దాటి। కప్పురంపు టంటికంబపు గుంపునంటిన తుదిదారిగోరింట పొదలు దూరి। యల్లిబిల్లిగ నల్లు మల్లెతీవెలనల్ల యెలతేఁటి మేటి పాటలకు నలరి। సురపొన్న గున్నల దరినున్న తిన్నెలపయి సోలి మేలి తేనియలు గ్రోలి। తావి చెంగల్వబావుల గ్రేపనడిచి । కన్నెగేదంగి పొదరిండ్లు గాంచి మెచ్చి। క్రొత్తజవ్వాజివలపులు గుత్తగాంచి। గుజ్జులేమావినీడల పజ్జనరిగి॥ ౫౪॥
మ॥ కనియెం బాలుఁడు తోటలోపలను వాల్గంటి న్నిగారంపుఁ గ్రొన్ననబోడిన్ లతకూనఁ గన్నియలమిన్నన్ బిత్తరిన్ మద్దియన్ । ననవిల్కాని కడిందిపూములికిఁ జానన్ జాజిపూబంతి మించినమేల్వన్నె పసిండిబొమ్మఁ జెలియన్ సింగారి లేజవ్వనిన్॥ ౫౫॥
సీ॥ తనయందమీ నేలఁ దనరొందఁ బోలుపొందు గట్టురాకన్నె యీకలికిమిన్న । తగమించు జిగినెంచుఁ దనమించు మెఱయించు కలువల చేడె యీతలిరుబోడి । మెఱుఁగారువగమీఱు మెయిసౌరుగల ముద్దుపలుకులకొమ్మ యీపసిఁడిబొమ్మ । తన మెప్పిదమె యెప్పుడును నొప్పఁదగు గొనములతమ్మికొమ్మ యీముద్దుగుమ్మ। రుప్పనఁజని నేనాయలరువిలుకాని । మిత్తినాతమ్మికంటి నామేలికొలఁపు । టరిదిసామి నా జగముచుట్టంబునిటకుఁ । దెచ్చెదను దీనిసొగసెల్లఁ దెల్పియనుచు॥ ౫౬॥ వ॥ చనుచున్న తఱి నచ్చేరువ నడయాడుచున్న యొక్క నెమలిం జూచి చిత్రాంగద నెచ్చెలులతోడ॥ ౫౭
చ॥ అడుగులు మెల్లఁ బెట్టుచును నచ్చటనిచ్చట నిల్చి చూచుచున్ । వడిఁ బొదరిండ్ల చక్కికిఁ జివాలున నేగుచు నెమ్మి జుట్టు బిట్టడరఁగ వచ్చె డుంగనుఁ డొంయాటలు మీరలు పాటుఁ డల్లదే। యెడపక వేడ్క మీఱ నెడ రేగుఁడు కైకొని రందు నేర్పునన్॥ ౫౮॥

చ॥ అనని దెసం దటంచుఁ దఱిరుపంజని పాఱుఁడు కొమ్మఁ గూర్చి యొ।య్యనననుఁ 'వచ్చె
డుం గనుఁ డోయామలు మీరలు పాఱుఁడల్లదే'।యని చెలిపిందు తోడ మమునవ్వలఁ
జూడక మున్నె యిట్లునీ।వనవిని నంతనుండి మదికచ్చెరువయ్యెడు మాకుఁ దొయ్యలీ॥౫౯॥
క॥ దవ్వులనాతనిఁ గన్గొని। పువ్వారుంబోఁడి యొక్క పొలఁతిఁ బిలిచి యీ।విప్వచ్ఛ బావ
నికినిడ। నెవ్వడి నొకగద్దెఁ గొంచు నెచ్చెలి రమ్మా॥ ౬౦॥ క॥ అని తనయనుఁగును గనుఁ
గొని। గొనబునఁ బనివినఁ బనిచినఁ గొనకొనిచని చ।య్యన నిగనిగమను గద్దియఁ। గొని
చనువున నెనరును బెనఁగొన నటనునిచెన్॥౬౧॥ వ॥ అప్పుడతండు॥౬౨॥ గీ॥ అది
గొ 'విప్వచ్ఛ బావడంచ'నెడు నారి। యీమె యెఱిఁగి నన్నానవాలిడియె నేమొ। పల్క
దటులు నీవివచ్ఛ బావఁడంచు। నవిదమది నెంచి యిట్లని యుండెఁబోలు॥ ౬౩॥
క॥ అని సందియంబు దొలఁకఁగఁ। జనియాతఁడు చెంతఁజేరి సరగనడఁకువన్। నన
బోడిచేయి చూపఁగఁ। గనుసన్నలఁ గూరుచుండె గద్దియమీదన్॥ ౬౪॥ వ॥ అంత
నప్పడు॥ ౬౫॥ ఉ॥ తోరపుఁబేరులూడ నసదుంగవు నల్లలనాడ ముంగురుల్। సారెకు
వీడఁ గ్రొంజెమట చక్కని చెక్కులమీఁదఁ గూడ బం।గారపు గిల్కుటందియలు
కమ్మని పాటలు పాడ నెంతయుం। గూరిమి నేలవేల్పు నడుగుం గవకుం జెలి మ్రొక్కెఁ
గ్రక్కునన్॥ ౬౬॥ గీ॥ మ్రొక్కి నిలిచినఁ జెలునవ్వు మొలకలెత్తఁ। బెండ్లికూఁతురవగు
మీవు వెలఁదియనుచుఁ। బుడమివేలుపు దీవించి పువ్వుకంతు। చేతిలోనుంచెఁ గూర్మి
తోఁ జెలువకపుడు॥ ౬౭॥ ఉ॥ కన్నులఁ బిన్ననవ్వులయఁ గైకొని కన్నులనొత్తి మ
న్ననన్। గ్రొన్ననయన్నుమిన్న నెఱిఁ గొప్పున నప్పుడ నేలవేల్పు గ।న్పన్నలఁ దాల్చి కెం
దలిరు చందముఁ బొందఁగఁ జాలు కేల్గవం। దిన్నఁగ మోడ్చి లోఁ దనివితీఱని కూరిమి
పేరమీఱఁగన్॥ ౬౮॥ ఉ॥ మెండగు వేడ్క డెందమున మీఱఁగఁ దమ్ములకన్న
దమ్ములై। దండిగనున్న మీయడుగుఁ దమ్ముల కిమ్ముల మ్రొక్కఁగంటి మీ।యండను జేరి
మిమ్ముఁ గొనియాడఁగఁ గంటిని మంటి నేడు గా। పండు పుమాకు మాకొదలు వానెవ
మీ దగు కూర్మిపేరిమిన్॥ ౬౯॥ గీ॥ అనిమఱియు నేమి యొ యపుడడుగఁ దలఁచి। సిగ్గు
చేఁ బల్కఁజాలక చెలులవంకఁ। జూడఁగా నామె యుల్లంబు చొప్పెఱింగి। వారి
లోపల మణిరేఖ పలికెనిట్లు॥ ౭౦॥ గీ॥ పెల్లుగా చెడు పేరెండఁ బెంపుతఱిగి। కుంద
నము వంటి నెమ్మేను కందిపోవ। నెచ్చటెచ్చటఁ ద్రిప్పంగ నిచ్చయిడెను। కటికితనమూని
మీయుల్లమిటులు మిమ్ము॥ ౭౧॥ క॥ బడలికయడఁగఁగఁ గొండొక। వడిమీరి చోఁట
నిలిచి పలుకుండొగి మీ।యొడయండెవ్వఁడొ మీరి।య్యెడకు న్విచ్చేసియుంట కె
య్యదికతమో॥ ౭౨॥ వ॥ అనియడుగుడుం గొండొకవడి చిదుముడిపాటున నెడదం
దలపోసి యతం డప్పడంతుల కిట్లని చెప్పందొడంగె॥ ౭౩॥ ఉ॥ మాదొర యొప్పుఁ
జెప్పఁదరమా మసకప్పడి యూతఁడారయం। బైదలి వేడ్క మీఱ వినుమా నికముందలఁ
దాల్చు దిట్టదా। గాదిలివేఁటకై యొఱుపుకై వడి నిప్పడువచ్చెఁ గానకే। మాదటవెంట

వచ్చితిమి యీయాయనచూడ్కికి విందుసేయుచున్॥ ౭౪॥ చ॥ తడవులనుండియేను
ముదితా యతఁడెచ్చటి కేగుచుండు వెం|బడిబడి నచ్చటచ్చటికి నానయునెండయు
నాకవేడ్కతో| నడుచుచుఁ గొల్చుచున్నకతనం గడునెయ్యముచూపి నిచ్చలా|తఁడె
యొసఁగుం జుమీ తనకుఁదానె మదిన్మముమెచ్చి యన్నియున్॥ ౭౫॥ సీ॥ చెలియరో
విను మేనుజెప్పెదనంతయు మొదల మాదొర యొకపూన్కి నెఱపఁ | దనమనక్కువెలు
వడి తద్దయుఁ గోరిక నందంపుఁ గలవాఁకలరసియరసి | యలతుమ్మెదలపాట లా
లించియాలించి సోలయక వింతలు చూచిచూచి | నెలలువం|డెండు పొలుపుగ నేలఁ
దిరిగి| తనదుపూనిక నెరవేర్చ దనఁదలంచి| వెండియుచ్చోట నొకపూటయుండమదిని|
దలఁపుపుట్టిన నాగినేఁ డెలమితోడ॥ ౭౬॥ సీ॥ సరిమాలుమావుల దరిఁ గ్రాలు బావుల
విరిచాలుతావుల వేడ్కనుంది| ననయేటిచోటులఁ జనుమేటితేటుల నను దేటపాటలకు
ను జెలంగి| యొనలేనివానలఁ బెనుపూనుకోనల ననతేనెసోనలఁ దనివిగాంచి| వెలినున్న
మెట్టలఁ గలనున్నచెట్టులఁ బలువన్నెపిట్టల పొలుపుచూచి| యొయ్యనొయ్యన నడతేరు
పయ్యెరలకు | డెందమునఁ బొంగి యుచటఁ నందంబుఁ గొంత | తడవు మాసామియును
మేము వెడలలేక | వింతలెల్లను గనుచుంటి మింతులార॥ ౭౭॥ గీ॥ అటులుచూచిన
పిమ్మట నడవిలోన| వేఁటలాడఁగ నించుక వేడుకైన| నిలిచియీచేరువను వేట సలు
పఁగడఁగి| విల్లునమ్ములు చేనల్లనెల్ల వెడలి॥ ౭౮॥ శా॥ సింగంబుల్వెడిపాఱమొట్టి ము
లుకుల్సింగాణికిందార్చి వే|త్రుంగం జేయుచు బెట్టిదంపుఁబలులం దూలించి చానేయు
చున్| బెంగంజెట్లకుఁ|బ్రాకుచో నెలుఁగులన్ బిట్టేయుచున్ లాగలం| గ్రుంగంజూ
చెడు పందిగుంపులతలల్ గూలంగఁ బెల్లేయుచున్॥ ౭౯॥ క॥ ఇక్కరణి నాతఁ డింతకుఁ|
బెక్కుమెకంబులనుబట్టి పెంపఱఁ జేయన్ | జిక్కకయొలుఁగొక్కటి యీ|చక్కఁ
బఱచెఁ గ్రొక్కెదల సందడిసేయన్॥ ౮౦॥ వ॥ దానింగానక కొంతతడవు వెదకి
వేసరి॥ ౮౧॥ ఉ॥ చాటుననున్నచో నెలుఁగుజాడ గనుంగొననైన వచ్చి ఖీ|బోటివ
లంతులచ్చెరువు పొందఁగలోఁ గొను నిచ్చమస్మ ని|చ్చోటికిముందుగాఁ బనిచెఁ జూప్వ
గనుంగొని రమ్మటంచు న|మ్మేటియు వచ్చుఁగర్జమిట మేలగుపల్కఁక వీనుసోకినన్॥
౮౨॥ క॥ ఇచ్చటికొమ్మలచెలువున | కిచ్చను గడుసంతసిల్లి యీకోనకునే | ముచ్చుగ
వచ్చితిమీఁదగు| మచ్చికనీయలరుఁ గొమ్మ మాదొరకనుచున్॥ ౮౩॥ వ॥ అని చేతిలో
నొక పూఁగొమ్మ పట్టుకొని॥ ౮౪॥ క॥ ఇక్కొమ్మపైఁ దలంపెథ | నెక్కువగాఁ గల్గి
యుండు నింతిరొకనినన్| ముక్కంటియబ్బరంవడు| నిక్కము దాచంగ నేల నీయాన
సుమీ॥ ౮౫॥ క॥ అని తెల్పి వారి వెండియుఁ| గనుఁగొని యోకన్నెలార గారవమున
మీ|నసబోడిఁ గన్నసుండియు| నెనరును వేడుకయు వెలఁగు నెలకొనెమాకున్॥ ౮౬॥
ఉ॥ ఈమురిపెంపుఁబల్కులును నీనును బాటల యొప్పిదంబు నీ|మోము చొకాటమున్
గనిన ముద్దియలారవినుండు వేయు నిం|కేమిటికీవెలంది మదినెంచఁగఁ దామరచూలి

రాణిసుమీ । యామెయొనర్చినట్టి జవరాలాయనంగను మాకుఁదోఁచెడున్ ॥ ౮౭ ॥
క॥ తొయ్యలి గ్రోలెయ్యది సే। రెయ్యది యీచెలువదాల్ప నెన్నికగనెనో । యి
య్యేలనాఁగం గడుపున। నెయ్యెకిమీఁకుం గనెను యెఱిఁగింపుడుమాకున్ ॥౮౮॥ వ॥ అనిన
వతని జాణతనంబునకును నేరుపుమాటల పొంకంబునకును డెందంబున నివ్వెఱపడి ॥౮౯॥
చ॥ పొసఁగఁగ లేమలొండొరుల మోములు గన్గొని కావిమోవులన్ । ముసిముసినవ్వు
వూన నొకముద్దియ నేర్పునఁ బల్కె జియ్య యొ। ద్దెసలను సామిచూపులకుఁ దెప్పర
ముండునె యీనెలంత యిం। పెసఁగఁగ నల్వచెల్వయొనరించిన కన్నియయా నిజంబు
గన్ ॥ ౯౦॥ చ॥ అదియునుగాక మీరలిపుడన్నియు మీయెకిమీఁ నిమన్ననం । బదిలము
గా నెఱుంగుదురు మావలనన్విన దగ్గదేమియున్నది యటులైన మాయెడల నబ్రపుఁ
గూరిమి పెంపుచెందఁగా। నిది తుదముట్ట మావలన నేవిన వేడుకమైనఁ జెల్పెదన్ ॥౯౧
గీ॥ పుడమిపువుఁబోఁడి కపరంజి ముద్దుతోడవు। పాలమున్నీటి పట్టికిఁ బట్టుకొమ్మ । పెట్టు
వోతలకెంతయుఁ బుట్టినిల్లు। వెలయు మణులూరనంగను వీడొకండు ॥ ౯౨॥ క॥ సిరికిం
బుట్టినయిల్లయి । కరమలరెడు మానికంపుగమికిం దావై । యిరవై ముత్యమ్ములకును।
బురుడించును బాలసంద్రమును బ్రోలెపుడున్ ॥ ౯౩॥ శా॥ అవ్వీడేలెడు చిత్రవాహ
నుఁడు నెయ్యంబొప్ప నెవ్వారల। న్నొవ్వం జేయక కప్పముల్గొనుచు నందున్నేలవిల్లం
దఁబో। నెవ్వేనిత్తురు మావులున్సిరులుఁ బెక్కేనుంగులుం దేరులున్। జివ్వల్మానితమం
తనే పెఱదొరల్ చేదోయి జోడింపుచున్ ॥ ౯౪॥ క॥ దండము వెట్టుచు ననయము।
దండిమగఁడ లేనిపోని దండుగ వేటే । దండేలమాకు నీవే। దండని పెఱరాచపిండు తనిఁ
దగఁగొలుచున్ ॥౯౫॥ గీ॥ పేరు యెఱిఁగి చెప్పి మెప్పింతుననుకొన్న। నేలయేని యసపుఁ
జాలవెల్లి। పలుకుచెలికెమిగులఁ దలమున్కలయినచో । నొరులుదాని నరయనోపు
వారె॥ ౯౬॥ గీ॥ అట్టియెకిమీనికి ననుంగుఁబట్టి యీమె । కనులయెదుర నె కాన్పించు
కతనవేలె, యీమె చెలువంబు పొగడంగ నేలమాకుఁ। బలుకు వెలఁదుకమెప్పనఁ గలిగె
నీమె॥ ౯౭॥ ఉ॥ ఏడనుమీఱెఱుంగని వి యేవియు లేవటుగాన మీదనే। జాడలనెప్పుడెవ్వ
నిని జవ్వని నెట్టనఁ జెట్టవట్టునో। వేడెదనిక్కువంబు వినిపింపుఁడు కల్లలువల్కరేని
నా। తోడు నుఁడీ యటంచు మదితొట్రిలఁబల్కిన నవ్వి యిట్లనున్ ॥౯౮॥ క॥ మేమ
రయఁగ మీవారము। కామే మమ్మింత వేఁడగా లాఁతులమే। లేమా లెస్సగఁ జూచిన।
మీమెలఁతుక యొక్కటియును మేమొకటియునే॥ ౯౯ ॥ మ॥ చెలియా సందియమేల
నీపడఁతుకం జేపట్టువివ్వచ్చుఁ డిమ్ములనామాటలు నమ్మియుండుము మిటుపైఁ బూఁబోఁడి
యుం గ్రీడి తా। మలరుం దావియుఁ బోలియొక్కటయి యొయ్యారంబుగా నుండఁ గ।
న్నులనిండం గనువేడ్క యీచెలులకున్ గొన్నాళ్ళకే కల్గెడున్ ॥ ౧౦౦॥ క॥ కన్నుల
విల్తలవాఁడిం । కన్నులలో మేలుబంతియగు నీనవలా। కన్నులతూపులుగావే । గన్నుల
ధారపట్టి గెలువఁగలవాఁడు సుమీ॥ ౧౦౧॥ క॥ నిలువెల్లఁ గనులుగలదొర। చెలువం

పుఁగోమారుఁగెల్వఁ జెచ్చెరమరుఁడున్। నిలువెల్లఁగనులుగలవిలు। బలువడిఁజేపట్టి సర
గఁ బడఁతుకఁగూర్చున్॥ ౧౦౨॥ వ॥ ఇంక మీకలికియు మీరును నూరడియుండుం
డనిన మణిరేఖ యిట్లనియె॥ ౧౦౩॥ ఉ॥ ఊరిటుపల్కఁ గల్కియన నెవ్వతెమేమన
నెవ్వరయ్య మీ।వారముగామె యందఱము వారలవీరలనట్లు మమ్మునున్। వేఱుగఁజేయ
మీకుఁదగునే యిది యిట్లనుటెల్లమానిదెసన్। గూరిమికల్గుకైవడియె నూఱును మీకడ
నింకనేటికిన్॥ ౧౦౪॥ ఉ॥ జాలమికేల మాచెలిదెసం బొలివోవనికూర్మి పేర్మి మా।
పాలిటి వేలుపన్నిటికి మాకిటుమిమ్మునె చూపిపోయె మా।చాలములెల్లఁదీఱె నిఁకజవ్వ
నిఁ బెండ్లికొమార్తెఁజేసి యీ।మేలొడఁగూర్పఁ బెట్టితిమి మీపయినెట్టును దప్పదింత
యున్॥ ౧౦౫॥ గీ॥ కొమ్మనాక్రీడితోడను గూర్పమాకు। నిపుడుమీకంటెఁ జుట్టం
బులెవరులేరు। కావునను మీరలెల్లైనఁ గలికికొఱకు। వేల్పుదొరపట్టికడకేగి వెరవు
మీఱ॥ ౧౦౬॥ చ॥ కనికరమూని మాదొరకుఁ గవ్వడి యీచెలియందు మున్నగాఁ।
గనిన కొమారు నీఁబలుకఁగాఁ దగుగట్టిగనింక మీరలి।వ్వనిఁ బయిఁబ్రేసికొందుమని
పల్కక యించుకయన్నఁజాలు మా।మనవి నిజంబుచేకుఱిన మాడ్కిన నెమ్మదినమ్మి
యుండెదన్॥ ౧౦౭॥ గీ॥ పదిగఁగొనియాడ నేపాటివారమేము। మఱుఁగుచొచ్చితి
మొక్కైన మగువనింకఁ। దప్పులెన్నక మన్నింపఁదగదెయిట్టి। చేతిపనితీర్పఁ దమకెంత
నేపుపట్టు॥ ౧౦౮॥ సీ॥ ఏఁజేయువిన్నపం బీడేర్చిననుగదా యేకీడుమాట నాలింపఁ
దప్పు। నిఁకఁగ్రీడిఁదనపట్టినియ్య నీకొల్పినఁగదమొందు నాగుండెకుదిరియుండు। నా
మేలిమాట నాయమచెవివేయఁ గల్గినఁగదా నెమ్మదివనటమానుఁ। బడఁతియాతని
చెట్టఁబట్టఁ గాంచఁగనబ్బు నాఁడుగాపండువు నాకుమిగుల। ననుచుమణిరేఖమఱియు
నెయ్యమునఁబలుకుఁ। బడఁతి తేనినెవ్వడు చెట్టవట్టునొయను। తమకమునఁబల్కి
తినిగాని తమకుపలుకు। మాట ముంగొంగుబంగారు మాటమాకు॥ ౧౦౯॥ గీ॥ అనిన
నన్నెలవేలుపుకనులుమూసి। యపుడులోనిచూపున నేదొ యరయునట్లు। మదినిదలపోసి
కనువిచ్చి మగువలార। మేము దపసులమయ్యును మీకుఁగాను॥ ౧౧౦॥ క॥ తడ
యక కవ్వడికడకున్। వడిఁబోవఁగ నొప్పకొన్న వారమవల మా।యొడయఁడును వేచి
యుండును। బడఁతీపోదుమని నెలవువడయుచునరిగెన్॥ ౧౧౧॥ వ॥ అంత నక్కడఁ
గవ్వడియును॥ ౧౧౨॥ గీ॥ ఇచట నున్నట్టులే తన్ను నెంచుమనుచుఁ। జెప్పి సంగడి
కాఁడెంత సేపాయెయ్యెఁ। బోయిరాఁడాయె నిదె చాలఁబ్రొద్దువోయె। నచటఁబో
యిన పనియేమొ యక్కడఁబోలు॥ ౧౧౩॥ గీ॥ అనుచుఁదలఁచుచు నవ్వలనలుగుడెంచు।
నెచ్చెలిమికాని దప్పుల నెమ్మిఁగాంచి। యెదురుచని చెప్పనంటకోర్పెదను లేక। చనిన
పని కాయెనొ పండొయనుచునడుగ॥ ౧౧౪॥ గీ॥ ఏనుబోయినపని కాయయేలయా
గును। బనిని బండించుకొనియె నేవచ్చినాఁడ। నిన్ను మున్నట్లు వీడ్కొని నేనుగదలి।

తొలుతఁ గాఱుకోనలుదాటి తోఁటఁజొచ్చి॥ ౧౧౫॥ క॥ ఎలజవ్వనమునందొలఁకఁగఁ| దొలుకాఱుమెఱుంగులట్టి తొడవులుగల యా| బలుసింగారంపు నెలం|తలలోపలఁ గూరుచున్న నాతుకఁగంటిన్॥ ౧౧౬॥ వ॥ ఆచక్కెరబొమ్మ చక్కఁదన మ్మెక్కించుక వక్కాణించెదఁ జక్కఁగావినుము॥ ౧౧౭॥ సీ॥ బయలరిక్కలచాలు పాఱవైచిన గొగ్గు మలలనెల్లను జట్టుపఱుచునేగి | పవడంబులను బ్రామసుపడఁగఁజేసినకీడు సింగంబు నడవిపాల్సేయురవ్వ| చందురులోఁగందుపొందించునారడి చిగురులఁగఱకుగాఁ జేయుకొదవ| నెత్తమ్ములను లోతునీటవైచినరట్టుఁ బసిఁడికిఁదావిఁగూర్పనికొఱంత | కలికిగోరులు నిబ్బెంపుగబ్బిగుబ్బ| లలఁతిమోవియు నసదుఁగొనలరుమోము | గొనబుచేతులు తెలిగన్ను లొనరుమేను| జేసి నెత్తమ్మిచూలి పోఁజేసికొనిమొ॥ ౧౧౮॥ గీ॥ ఈడుకలిగించియును బువ్వుబోడికీడు| కలుగకుండఁగ నొసరించె నలువయార | తలఁచిచూచిన నేదిమో తమ్మిచూలి| టక్కుఁగావింపఁగాఁబోలు నిక్కముగను॥ ౧౧౯॥ గీ॥ నలువ తమ్ములఁ గల్వలఁ జెలువుమీఱఁ | జేసి యవి రేయుఁబవలును జెన్నులేని| పాటఁ పొడగాంచి యారెంటి నేటఁగలిపి| కలికికన్నుల ననయంబు వెలుఁగఁజేసె॥ ౧౨౦॥ గీ॥ నేలపైనంటులుంటయే పొలివింత| యనుచు మదినెంచి వింతసేయఁగఁదలంచి నలువ యనఁటులపై నేలకలుగఁజేసె| నెలఁతతొడలును మెలయునన్ నెపమువెట్టి॥ ౧౨౧॥ ఉ॥ మించులఁగెంపులన్నెలను మేలియనంటులఁగూర్చి నల్వమై| మించును వాతెఱన్మొగముఁ బెన్దొడలుం దగఁజేసి బాసిలో| నించినతళ్కునుంబిగియు నీలియునాకును దీసిచూపులున్| బించపుఁజన్నులుందురుము వీపు నొనర్పఁగఁబోలునింతికిన్॥ ౧౨౨॥ చ॥ అలతలకట్టులింతెఱులన్ను కనుల్నిడుదల్వలంది చెన్నలరెడు బొజ్జువట్రునుడి నాతుకనైకపుఁగౌనునున్న బంతులు ననబోడిచన్నుఁగవ దొంతిగవిడ్డలు రూపుపూని యా| మెఱఁత నెపంబునం బుడమిమీదను గ్రుమ్మరుచున్నవారయన్॥ ౧౨౩॥ గీ॥ నేరెటేటి యసటమించు నిగ్గమర్చి | నాతిచెలువంబుఁ జేయుచోఁ దాతకాన | మగువ నెన్నడుమొనరింప మఱచిపోయె| ముదిమివచ్చినతఱి నెట్లు మదులునిలుచు॥ ౧౨౪॥ క॥ చన్నుంగవ యందముఁగను| చన్నుంగవయందలంతు వటనీవున్న| న్నెన్నడుమును గనితలఁచితె| నెన్నఁడు మునుగనియెఱుంగ మీయసదనుచున్॥ ౧౨౫॥ గీ॥ కలిమి కొండంతకన్నను గరముఁగలిగి | ఊయిగానుండె బిగిగుబ్బదోయిచూడ | మెండు నెత్తమ్మిమొగ్గల నిండియుండి| గొప్ప మొసలిచేరిన మేటికొలఁకుఁబోలి॥ ౧౨౬॥ క॥ పలువరుసతెల్లమల్లెల| పలువరుసలనంగవచ్చుఁ బైదలి చెలిక| త్తెల వగచూపు తెగలుక|ల్వల వగచూపు తెగలనఁగనచ్చును రేఁడా॥ ౧౨౭॥ గీ॥ అనిమఱియుఁ జెప్పఁబోవఁగ నతఁడుచెప్ప| మాటకడ్డంబువచ్చి యమ్మేటిఱేఁడు| నిట్టలంబగు తమకంబుపట్టలేక | తనమసంగడికానితో ననియెనిట్లు॥ ౧౨౮॥ చ॥ పొదలెడువేడ్కనీవిపుడు పోయిన కజ్జముమాట మాని నీ|కొదుఁగనిచేతఁగాని పనియొక్కటి పైనిడుకొంచు నేమిరా | చదివితి వింత

నేపు నిఁకఁజాలుఁ బొగడ్తలు కట్టిపెట్టి యిం|పొదవఁగఁ దొల్తఁదెల్పు నను సుగ్మలి నైకొన నిచ్చగించుటల్॥ ౧౨౯॥ చ॥ అను చెలికాని తత్తరము సంతయుఁ గన్గొని తాను జేని వీ|డ్కొని యటుపోవుటల్ మొదలు గుబ్బెతలుండిన పూవుఁదోటక| జని పలుకాడుటల్తుదఁగఁ జక్కఁగనంతయు విన్నవించి యి|య్యనఁ జెలికత్తియల్ పలికినట్టి తెఱంగెఱిఁగించి యిట్లనుఁ॥ ౧౩౦॥ గీ॥ నిన్నువేడెద మన్నించి నన్నుకింత| పలుకు చెవిఁబెట్టి యాకన్నెవలన నీవు| మున్నుగన్నకొమారుని వన్నెమీఱ| నెలమి మామకుఁ జెంపుగ నియ్యవలయు॥ ౧౩౧॥ గీ॥ ఇంతవట్టును జనువిప్పడిత్తువేని| కొమ్మ తప్పకిప్పడే నీదుసొమ్మెసుమ్ము| నేనుజెప్పితినని వెన్కనేరమిడక| యిపుడ ముందుగఁ జక్కఁగ నెంచుకొమ్ము॥ ౧౩౨॥ ఉ॥ ఏలతలంప వేపలుకులించుక దేవర యానతిచ్చి నం|జాలును నేలజేని సరసం దగ నేలినవారికర్జముఁ| వీలుగ మాటవెంబడినివిన్నప మాననఁజేసి వ్రేల్మిడిఁ| మేలొనగూర్చివత్తు ననుమెచ్చఁగ నిప్పుడ పోయివచ్చెదఁ॥ ౧౩౩॥ వ॥ అనిన గారవంబున విశారదున కానేలజేఁ డిట్లనియె॥ ౧౩౪॥ క॥ సతమును గోరికలూరఁగ| నతివఁగవయ నెవ్వడెప్పడనుచుండఁగ నిం|తతడవుచెప్పఁగ నేటికి| బతిమాలఁగ నేడు క్రొత్తవాఁడనె నీకుఁ॥ ౧౩౫॥ చ॥ పలుకులిఁకేల నీవనువు పన్నుగఁజేసెద నెన్నఁడైన నీ|పలుకున కడ్డమాడుదునె పట్టినొసంగెద జేపెపోయి యా|పొలఁతుక కన్నతం|డ్రికడ ముచ్చటలాడుము మేలునెంచి నీ|కెలమి నిఁకేమియిచ్చినను నించుకయేనియు నప్పదీఱునే॥ ౧౩౬॥ గీ॥ అనుచుఁగొనియాడి చెలికానిఁ జనువు మీఱ| మగువపలికిన పలుకులు మఱియుమఱియు| నడిగి విన్నవేఁడించు నెయ్యంబు మిగుల| వేడ్కపడుచుండెఁ గవ్వడి విసుగులేక॥ ౧౩౭॥ వ॥ అనినఁ దరువాతికత చెప్పుమని జనమేజయుం డడుగుటయు॥ ౧౩౮॥ నిరోష్ఠ్యకందము॥ రక్కసి జేండ్లం గలనఁ| జక్కఁడచి యలతెఱగంట్ల సాకెకిదిట్టా| చక్కఁగ నెల్లరసేగిం| జిక్కఁగ నియ్యక యరసెడి జేజేరాయా॥ ౧౩౯॥ ఉత్సాహ॥ చుట్టువాలుకేలఁబూని చూడు నిన్నుఁజంపి చే|పట్టువాఁడఁ గ్రీడినంచుఁ బన్నితేరుడిగ్గి వే| పట్టుపట్టి విన్నుదాఁకపట్టి మీఁది కేగుచోఁ| బట్టికీడి వెన్కకీడ్వ బాగుమీఱు వేలుపా॥ ౧౪౦॥ గద్యము॥ ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబయిన రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునందుఁ దృతీయాశ్వాసము॥



# రసికజనమనోరంజనము.

## చతుర్థాశ్వాసము.

క॥ సిరిపడఁతి యెడఁద నెప్పుడుఁ। గరములరఁగఁ గొల్చువారిఁ గడుఁగూరిమితో। నరయుచు నెల్లజగమ్ముల। వెరవారఁగఁ బ్రోచుచుండు వేల్పులవేల్పా॥ ౧॥ వ॥ వైశంపాయనుం డటుమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పందొడంగె నట్లాబోటు కంపు నేలవేలుపు సూటిగా మాటలాడి యాచేడియలన్వీడుకొని క్రీకకడకు న్వేడుక మెయిం జనినవెనుక నమ్మచ్చెకంటి తమకంబు హెచ్చి పెచ్చుపెరిగెడి మరునిచ్చున వ్రేఁగంజొచ్చిన నెచ్చెలులెల్లఁ బెల్లుగఁ దల్లడిల్లి యుల్లంబులోని యారటంబుదీఱ నూరడింపుచుండ॥ ౨॥ క॥ పడమటిమలకలుగులలో। నడఁగిన యిరులనుగడంక నవలికిఁ దఱుమన్। వెడలెడి వడువున నడిచెను। బడమటికొండకును బ్రొద్దువడిఁ గెంపడరన్॥ ౩॥ చ॥ అవనది తప్పి వేఁడివెలుఁగత్తమిలన్ దడమెత్తుపాముగా। ముదొరవిసంపుమంటలనఁ బొల్పగుఁ బద్మరసంజ కావి, పైఁ। గుదిరిన సంజచీఁకటి తగుంబొగయట్ల, చెలంగు నల్లత్రాచు దడములట్ల చీఁకటులు, చుక్కలాగిం దలమానికంబులై॥ ౪॥ సీ॥ వేయనితమ్మలం బాయెను జిగికెంపు బిగిసొంపుదలకింపు పెదవులకును। పూననికుంకుమ బొట్లయ్యె విదియ చందురు నందమును బొందు నుదురులకును। వెడలనియొత్తురవికలాయె మెఱుఁగారు జక్కవకవమీఱు చన్నులకును। బెంపొందు కెంపుల పేరులయ్యెను బోకపొత్తుల పొత్తానుకుత్తుకలకు। నసుచు గడిదేరి మదిజాఱి హద్దుమీఱె। నంకుటాండ్రు డెందంబులఁ గొంకులేక। మిండగీండ్ర రాకలు గోరమొందుకొనియెఁ। గెంపుచాయలు పడమర నింపుమీఱ॥ ౫॥ గీ॥ గొంద్లిసలిపెడి యురవడి గుబ్బలల్లు। జడలగుంపులు వీడి యీపుడమినెల్ల। నలుచుకొనియె ననంగను నలుపు మిగిలి। కటికిచీఁకటి యెల్లెడఁ గ్రమ్ముకొనియె॥ ౬॥ చ॥ అలరెడు శేవెలంది చెలువారఁగఁ దాల్చిన కావిరంగు దువ్వలువ వదల్చి చందురుని వావిరిఁ బొందఁగఁ గోరి మల్లెమొగ్గలుగల నీలిచీర మెయిఁ గట్టెననంగను జూడ నొప్పెఁ జుక్కలగమితోడఁ జీఁకటులు కన్నులపండువుగాఁగ నయ్యెడన్॥ ౭॥ ఉ॥ గొందులు దూఱుచున్వడలి గోడలు దూకుచుఁ బొంచిపొంచి బల్। సందడిగాకయుండఁ జిఱుసందులవెంబడిఁ దాఁపుఁ జేరుచున్। సందియమంద కాఱడికి సైపుచు సాముల మోసపుచ్చుచుం। జెందిరి కోరుకోరికలఁ జేరి బొజుంగులు దొంగలుందఁగన్॥ ౮॥ గీ॥ తమ్ములను దాయయారేఁడు తాఁ జగమ్ము। నందుఁ జొచ్చియుంటకుఁగాను ముందుపంపి। నట్టి తెలిగుడారమనంగ నమరెఁ దూర్పు। దెసను దెలివన్నె కలువలు తెల్వినొందె॥ ౯॥ ఉ॥ చుక్కలరేఁడు చీఁకటులసూడు వెలుంగుఱేఁని జోడు బల్। జక్కవపుల్గుమొత్తముల సారెకు నేచెడివాఁడు చక్కనౌ। మిక్కిలి కంటిదేవరకు మే

ల్నగమై తగువాఁడుకల్వలఁ । మక్కువఁ బ్రోచు ఱేఁడు మరుమామ కనంబడెఁ దూర్పు కొండపైఁ॥ ౧౦॥ చ॥ తఱియను వేఁటకాఁ డిరులదండను కోయిలగుంపుఁ బట్టఁగాఁ। బఱచి వలన్నిగిడ్చె ననఁ బర్వెను దూర్పునఁ దెల్పు, లోఁ జిగుర్చెఱకయి పెట్టినట్టు నెల యింపగుఁ, బడ్డ పులుంగసంగళం। కొఱపగుఁ, గాంచి పర్విడెను నోరుమనఁ గోయిల లేగుఁ జీఁకటుల్॥౧౧॥ చ॥ కొమరువెలుంగు రేవెలఁది కొప్పనఁ జీఁకటి, కొప్పుపూలనాఁ నమరును జిక్కఁ జాల్, నెలయొయారపు రాగిడిబిళ్ళయట్లగుఁ,। సమకొనుకందులో నిడిన నల్లని ఛాయన నొప్పు రాగిడిఁ। జములుగఁ జుట్టుమల్లెలనఁ జందురుచుట్టును దెల్పుగనబడెఁ॥ ౧౨॥ గీ॥ తమిని రేవెలందియిడు గందంబు మేనఁ। దాఁజలువల ఱేఁ డప్పుడు తాల్చెననఁగఁ। దెల్లనయ్యెను జందురుండల్లనల్ల। నెల్లకడలను వెన్నెలలల్లుకొనియె॥ ౧౩॥ సీ॥ నెఱతావులు చెలంగ నిండారవిరిసిన మల్లెపూవులతోడ వెల్లివిరిసి। కప్పురపుటనంటి విప్పుఁ బోరలరాలు కప్రంపుఁ బొడితోడఁ గలసిమెలసి। కమ్మవిల్తునిదాయ కాపురంబైతగు వెలిమలజిగితోడ వియ్యమంది। కలివేల్పునిల్లాలిఁ గనిపెంపుగాంచిన పాలమున్నీటితో మేలమాడి। మెండుకొనియుండె బువినిండ వెండికొండ। కొండపిండులఁ జెండెడు దండిహత్తి। పిండికలకండ వెలిఁదమ్మిదండఁ దెగడి। పండురేయెండ దండులు నిండుజిగిని॥ ౧౪। వ॥ అత్తఱి నాబిత్తఱి చెలికత్తెలతోడ నత్తోటలోనుండి నిండి కొన్న పండువెన్నెల తెగలసెగలకుం దాళంజాలక॥ ౧౫॥ ఉ॥ చెందొవవిందు దందడినిఁ జిందరవదర చెందికుందఁగాఁ। జిందురుచిందఁ, గొందలము చెందఁగ డెందము కందుఁడెందపుం। గెందలిరుం దగం దొడుగఁ, గ్రిందుపడంవగు పొందికందొగల్। సందడిచింద, దుందుడుకు చందముఁ బొంది వెలందివందురుఁ॥ ౧౬॥ ఉ॥ నెయ్యపుటొజ్జలోఁ గఱపి నిచ్చలు నూల్కొలుపంగ నేరెము। యొయ్యొయ్యన సన్నగించి మది నొంటిగ నల్లజగంబు చుట్టముఁ। నెయ్యము నందలంపుచును నిల్చినవన్నియు మానఁగా నతం। డయ్యెడ మ్రోలఁ గన్పడె నయారి యుప్రాలెను గన్నుమాయచుఁ॥ ౧౭॥ వ॥ ఇట్లాతండు తనకన్నుల మ్రోల నిలిచినట్లయిన మదికలంగి యచ్చెలువ యొక్క నెచ్చెలితో నిట్లనియె॥ ౧౮॥ ఉ॥ వీఁడుగదమ్మ నావలపు వీరడిచేసినవాఁడు, పొన్నపూ। వీఁడుగదమ్మ లోతయిన యాతని పొక్కిలికింక నావెతల్। వీఁడుగదమ్మ నన్నిపుడు వేమఱఁ జేర్చిన నీతఁడున్నయా। వీఁడుగదమ్మ నేఁ గలవీడులలో పలమేటి బోటిరో॥ ౧౯ వ॥ అని వచ్చవిల్తుని నెఱచిచ్చునం గ్రాఁగుచు మఱియుం బలవింపం జొచ్చిన నెచ్చెలులు చలువపనులు సేయందలంచి॥ ౨౦॥ సీ॥ చేడియ యడుగులఁ జిగురాకులుంచిరి యింతి చన్నులఁ బూవుబంతులిడిరి। పొలఁతి తొడల నంటిపొరలనంటించిరి ముగుదపొక్కిటఁ బొన్నపూవునిడిరి। యువిదవాల్గన్నులఁ దొవరేకులద్దిరి చాన కెమ్మోవిఁ బూఁదేనె యిడిరి। తొయ్యలిచేదోయిఁ దూండ్లను బెనఁచిరి కొమ్మ కేల్గవ విరిదమ్ములిడిరి। యలివ యడుగులోన గువానికవ్విసాటి। కావ సరియైనయని చూచుకరణిఁ జెలువ। చెలులు

కావించిరొక్కటఁ జలువపనులు। వానివానిని బోలినవానిఁగూర్చి॥ ౨౧॥ వ॥ అంత
నొక్క ప్రోఢచేడియ వారలంజూచి॥ ౨౨॥ సీ॥ మరుచిచ్చు దరికొని మఁడెడు నెమ్మేన
నీవనల్చేఁబూనిని సరవలదు। కంటికాటుక నీటఁగందైన చెక్కుటద్దంబుల గందంబు దార్ప
వలదు, వలపుచీఁకటిఁ బెంపు వాసిన తురుము తేఁటుల సంపెగ ల్చుట్టఁదలఁపవలదు। బలువిరా
శంపుఁగాకలఁ గందుచను నిమ్మపండులఁ గప్పురంబలఁదవలదు। దెసలనెల్లను బర్వుచు
దిటముచెంది। పిక్కటిల్లుచు వెలుఁగొందు చుక్కలదొర। కాయు వేఁడివెన్నెలలందుఁ
గలుకులార। పెట్టవలదు తామరకంటిఁ బెంపుమీఱ॥ ౨౩॥ వ॥ అని యా చిత్రాం
గదవంకం దిరిగి॥ ౨౪॥ సీ॥ కైదమ్మిమోము చుక్కలఱేని నెగఁగందఁ జెక్కునఁ
జెయ్యేలఁ జేర్చెదమ్మ। జార్కొప్పు చీఁకటిఁ జనుజక్కవలు గుందఁ జ్ఞానరో కురులేల
జార్చెదమ్మ। ననుముక్కుసంపెగ నూగారు తుమ్మెదల్ బడలంగ మోమేల వాంచెదమ్మ।
మినుకుకాటుక నీట ననుజెక్కుటద్దముల్ మాయఁగన్నీరేల వఱపెదమ్మ। చేయి దామ
రచెక్కునఁ దీయవమ్మ। ముంగురుల్ జాఱనీకమ్మ మోము మీఁది। కెత్తవమ్మ కన్నుఁగవ
నీరొత్తవమ్మ। వలుకువినవమ్మ లేవమ్మ పసిఁడిబొమ్మ॥ ౨౫॥ గీ॥ గట్టువిలుకానినైనను
గడియలోన। క్రిందుపఱుపంగఁజాలిన క్రీడియంత। వానికిని దుంటవిలుకాని బారిపడఁగ।
నీక నినుఁగాచు టాకబరువే నెలంత॥ ౨౬॥ గీ॥ నేటరేపట నిఁకమన నేలవేల్పు। మ
న్ననను జక్కఁబడునన్ని మానువెతల। ననుచు ననబోడిఁ గడువేఁడి యంచువలన। నూఱట
యొకింతగాన కయ్యువిదమిన్న॥ ౨౭॥ వ॥ తోడి చేడియల తోడ॥ ౨౮॥ క॥ మున్ను
కొని మరుఁడీక్రైడి। ననబోడి మెఱుంగుఁజనుల నడుమనె పెడకుం। జనకుండ గుఱిగ
నేయుటఁ। గనవింటికె కన్నులుండఁ గాఁ బోలుఁజుఁడీ॥ ౨౯॥ ఉ॥ చేతులు తమ్మి
తూండ్లనుచుఁ జేరిరయంచలు కొప్పుఁజూచివే। బీతున నల్లమబ్బనుచు వెన్గనఁ, బంచిన
గాలినారు పా। మేతరుమంగఁ బువ్వులుతుఁడేమిటఁ జామను గెల్వలేమిఁ ద। ర్వాత నెమ
ళ్ళఁగూర్చెఁ బగవానికొమారుని వారువంబులన్॥ ౩౦॥ వ॥ అని చెప్పి యప్పుడు చెవు
లుచిల్లులువడఁ గడుఁగూయు కోయిలలు మొదలయినవానిం గూర్చి పేర్చిన కినుక పెం
పున నిట్లనియె॥ ౩౧॥ సీ॥ ఒరులవంచలఁ జేరి యున్నట్టి కోయిలా యెందుకు నీకింత యె
గిరిపాటు। నిలువఁజోటును లేక నింగి ప్రేలెడు చందమామ నీకేల ద్రిమ్మరితనంబు। చచ్చి
చావని వాని చాడ్పున నున్నట్టి మరుఁడ నీకేటి కీమండిపాటు। కదిసి కొమ్మలపాల బ్రదుకఁ
గాంచిన తుమ్మెదా యేల నీకింత యదరిపాటు। మీకు నునువోలె నిపుడు మా సొలఁతే
తోడి। యొక్కమాటనుంటయును మోమోటమియును। లోనిచుట్టఱికంబును జాను
మీఱు। చూపు చెలికారమును గొంతచూడవలదె॥ ౩౨॥ క॥ కలువల దొర యల్లుఁడ
వై। కలువలె తూపులుగఁ దాల్చి కరమలరెదు నీ। కలుక మెయి నక్కటకటా। యఖ
కొందిన కలువకంటి నలఁచుట తగునే॥ ౩౩॥ వ॥ అని మంచిమాటల నెంతవిన్నవించిన
నించువిల్కానివలన నించుకంతయు నక్కటికంబుగానక కటకటంబడి పడంతి యా

వెడవిల్తు నిట్లు దూఱందొడంగె॥ ౩౪॥ ఉ॥ ఒజ్జలకాపురంబు మొదలూడఁగఁద్రొబ్బిన రేయిఁద్రిమ్మరిన్ । బజ్జను జేర్చికొంటివట ప్రగ్గడగాఁగను, గన్నతల్లులన్ । విజ్జునవీడనాడిచెడి వేఁబలుగాకులఁగూడుపుట్టుగు । గ్లిజ్జగమందు నీకుదడమేయట యింతులదోసమెట్టిదో॥ ౩౫॥ గీ॥ చేతఁజెఱుకువిల్లాకృటి చిక్కఁబట్టి । కంటఁబడకుండఁ బూదూపుగములునాటె । దేలనిఁకమీఁదఁ దూపులు నేలఁగలియఁ । బిల్చినీవిల్లు ౘ్రేల్మిడిఁ బిప్పియిడుదు॥ ౩౬॥ గీ॥ తోడఁబుట్టినదనినైనఁ జూడవెపుడు । నీదు తల్లి యిల్వెరిఁగాల్చి నీదుపగతు । కడసుదలమానికంబయి గరువపడెడు । నెలను జెలిఁజేసికొంటచేఁ దలువవీవు॥ ౩౭॥ గీ॥ అని మరుమఱియుదూఱఁగ నతివయొకతె । కంటఁబడకుండు మరు నేలకఱవలాడ । మిఱట్రఁగడుమంగ్రము నెలచాలమేనుగాడ । ననుచుమరలింపఁ జందురుఁగనుచుఁబలికె॥ ౩౮॥ గీ॥ ఒకటిరెండునాడులు చెల్లియున్నాడె । చూడరాదని నిను బెద్దలాడుచుండఁ । బెద్దవాఁడవై మిన్నంది పెలఁగునిన్నుఁ । జానలకుఁ జూడవచ్చునే చందమామ॥ ౩౯॥ గీ॥ తమ్మికంటియటంచు మాతలిరుబోడి । నలుకమెయినలంచెదవేమి యిట్లుకాదు । కలువకంటియెసుమ్ము మాకలికిమిన్న । కనికరముచూపి కావుమో కలువఱేఁడ॥ ౪౦॥ చ॥ సిరికినితోడఁబుట్టువయి చెన్నగ వెన్నునకున్ మఱందివై । యరపదిమోములున్నదొర కౌదలనందపు మానికంబవై । మరునకు మేనమామవయి మన్నన నత్రికిముద్దుపట్టివై । కరమలరారునీకిటులు కల్కులనేచి కలంచఁబాడియే॥ ౪౧॥ చ॥ ఒరులకుఁజేరదవ్వగుచు నొజ్జలకొంపనుదీసి తమ్ములం । గరము బడల్పడంబఱపి కాంచినతండ్రికిఁ బోటుతెచ్చి వం । కరతనమల్ల చిన్నపుడె కాంచి కరంబును నీవు రేయిద్రిమ్మరివని పేరుపొంది యిఁక మన్ననఁ జూతువె యాడువారలన్॥ ౪౨॥ మ॥ కడలిన్నార్వపుటగ్గితోఁబొడమి వీఁకన్మిఱివేవెల్గు నెక్కుడు కాకంగడువాడిమిన్నెల నెలం గూడందగంజాలి యెప్పుడుఁ బెన్పప్పుగాఱుకోఱల విసంపుంజిచ్చుకున్నైచియీ । పుడమిన్మిన్నలుముట్టు నీకుఁ జలువల్ పుట్టంగ నెట్లబ్బెడున్॥ ౪౩॥ సీ॥ నీదు వెలుంగులు నెఱకాకతొటను జాలనీరగు నెలఁబాలె తెలుపు । నీవడత్తకరంబు నీతంబు తప్పుట నువిదఁగోల్పడిన నీయొజ్జతెలుపు । నీదువెన్నెలగముల్ నెఱవాడుతొటను దలవాల్చు తమ్మిమొత్తములె తెలుపు । నీరూపు చూపరకోరువరాకుంటఁ గవవిడియేగుజక్కవలెతెలుపు । నిట్టినీవలనను మేల్మియెట్లుగలుగు । సరిగనీరూపు నానాటసన్నగించి । పిదపఁబదియాఱువ్రయ్యలై పెద్దపాము । నిన్ను మ్రింగిన నెలఁతలనెగులుదీఱు॥ ౪౪॥ వ॥ అని చందురుందూఱి యుల్లంబు జల్లన మెల్లన మేనెల్లఁ జల్లులువోవఁ బెల్లువీచు చల్లగాడ్పుగూర్చి యల్లన నిట్లనియె॥ ౪౫॥ గీ॥ లేడికన్నులుగలది యీలేమమిన్న । లేడినెక్కుచుఁ దిరిగెడువాఁడవీవు । నిట్టి చుట్టఱికంబుండ నింతినేచఁ । దగునె తనకీవెయయనురనితలఁచియుండ॥ ౪౬॥ చ॥ జగమునకీవుకీడు గడుసల్పుదువంచునుదమ్మిచూలి నెవ్వఁగనిను నెక్కమూలఁ బడవైచెను దాననడంగకున్ననిన్ । దగమొసవం

గఁ బాహులకు నాల్కలు రెండొనరించి వానికిన్। జగమున వేయియేఁడులుమనన్ బ్రదుకిచ్చెనుగాదె వయ్యరా॥ ౪౭॥ వ॥ అని యెల్లయెడలఁ బిక్కటిల్లి మిక్కుటంబుగాఁ బెక్కువగలఁజెవులు వగులనఱచుచుండు గండుఁగోయిలలు లోనగువానింగూర్చి యిట్లనియె॥ ౪౮॥ సీ॥ కొమ్మల నదలించు కూళపయ్యరపిన్న చెలపట్టినిప్పుఁ బాములు ఘోసంగ। కాకిమూకలలోనఁ గలసిమెలంగుచుఁ గేరుకోవెల నీదు నోరుపడను। పండ్లు కొఱుకుచు నిల్వక యెగసిపడెడు చిలుకనీ బ్రతుకు కెల్లఁ జెట్లఁగలయ। పురుటింటిబూచులపోల్కి నివ్వెఱగొల్పు తుమ్మెదా నీ త్రుళ్లు తుప్పలెక్క। గంతులిడుచును దెరువర్లఁ గలఁచుచుండు। నెమ్మినీయాటలెల్లను నేలపడను। నీళ్లు నములుచు మగువలనెగులుపఱచి। నిక్కురాయంచ నీతిండి నీరుగాను॥ ౪౯॥ వ॥ ఇట్లు దూరుచుండ॥ ౫౦॥ ఉ॥ పిట్టలుగూసెఁ జీకటుల పెంపెడఁబాసె మెఱుంగురిక్కచాల్। బిట్టుగమాసె జక్కవలు వేడుకనొందెఁ దొరుడాసెఁ గల్వలెప్పట్టునఁ దెల్వివాసె వెతవాసిన తమ్ములుపొంగి తేంట్లకున్। నెట్టనవిందుచేసె విలునేర్పనమూసె మరుండు వేఁకువన్॥ ౫౧॥ గీ॥ వెచ్చకొండ్రమదుల వేడుకడిందంగ। పొఱులలరి పగటిపనులకడర। వడిగఁగాపువారు పనిపాటలకుఁబోవ। తూర్పుకొండమీఁదఁ దోచెఁ బ్రొద్దు॥ ౫౨॥ ఉ॥ క్రిందటినాడె యట్లరిగి క్రీడివయిం గడువాలుగంటికిన్। డెందముచిక్కియుంటయును డీల్పడి పెన్వలవంతనింతిదాఁ। గుందుచునుంటఁ గ్రీడి యిటకుం బనిమీఁదను వచ్చియుంటయున్। గుందునఁ జిత్రవాహనునకుం దగఁ దెల్పెను జిల్కలర్మిలిన్॥ ౫౩॥ చ॥ తెలిపినఁగొంత సేపు మదిఁదేకువతూలియుఁ దెల్విఁగాంచుచున్। మెలపునఁ గ్రీడియల్లుఁడగు మేలిపుడే యొడఁగూడఁ జేసికో। వలెనని యెంచి ప్రగ్గడలఁ బంచెను గవ్వడిపాలి కప్పుడే। వలసిన మాటలంగఱపి వారినివీటికిఁ దోడితేర గన్॥ ౫౪॥ క॥ తగువారలవెంటంగొని। ప్రగడలుచని క్రీడిఁగాంచి వరుసగఁ బలుకం। దగుపలుకులాడి విందుగ। నగరికి విచ్చేయ వేడ నగుచునతండున్॥ ౫౫॥ కం॥ గారవమునఁ దమ్ముఁదోర। వారటు ప్రగ్గడలఁ బంచి వానిగఁ బిలువం। గా రాకుండుట తగదని। కూరిమినేనుంగునెక్కి గొబ్బునఁ గదలెన్॥ ౫౬॥ గీ॥ ఆముతేనుఁగుపైనెక్కి యర్జునుండు। రాచనగరికిఁ బోవుచోఁ జూచువారు। వేయికన్నుల వేలుపుబిడ్డఁజూడఁ। వేయికన్నులె వలెనంచు వింతపడిరి॥ ౫౭॥ గీ॥ పొడుపుకొండమీఁదఁ బ్రొద్దువెల్గెడునట్లు। వెలుఁగుచతఁడు వీట వెడలునపుడు। ఘొలఁత్తుక లవరంజి మేడలపయినుండి। యలరువానగురిసి రతనిమీఁద॥ ౫౮॥ గీ॥ క్రీడి వెంచేయుచున్నట్టి జాడ తెలిసి। వడిగఁ దగువారితోఁ జిత్రవాహనుండు। గొరుపై నెక్కి యెదురేగి గారవమున। తోడుకొని తెచ్చి విడిదిలోఁ దొరను నిలిపె॥ ౫౯॥ గీ॥ విడిదిచేరినపిమ్మట వేడ్కమీఱ। నేకతపుటిల్లుచొచ్చి వారిరువురింత। మంతనంబున నేమేమొ మాటలాడి। యేగుదెంచిరి నవ్వుకొం చివలకపుడు॥ ౬౦॥ వ॥ అంతస్వంతసంబునఁ జిత్రవాహనుండు తగుపోడిమిం గ్రీడిని తోడుకొని తనయింటికి నవ్వచ్చి పెద్దలం

జెచ్చెరరావించి వారలగారవించి పెండ్లికిందగిన మంచిమూరుతంబు పెట్టుఁడని కట్టడ యిడి యూరు నై సేయఁ జాటంబంచిన॥ ౧౧॥ సీ॥ కస్తురిపన్నీటఁ గలయంపిచల్లించి గోడలు జవ్వాజితోడవలికి। ముగ్గులుకట్టాణి ముత్తియంబులఁబెట్టి నెలజాలతోడఁ దిన్నియలువైచి। డంబైనవగడంపుఁ గంబముల్నాటించి తెల్లక్రొవ్విరులఁ బందిళ్లువేసి। తోరంపుఁబచ్చల దోరణంబులుగట్టి రతనంపుదివ్వెలు జతనుపఱిచి। తావులమెఱుంగుఁ గుఱువేళ్ళ దడులుకట్టి। వీడు నై సేసి రెలమినవ్వీటివారు॥ ౧౨॥ గీ॥ పెండ్లిపనులెల్లఁ జేయించి పేర్మితోడఁ। జుట్టములనెల్ల రావించి సొబగుమీఱ। విడిదెలోవలసినవన్ని వెసనమర్చి। లగనమిదెడానెనని పేఁడుతగఁగఁబలుక॥ ౧౩॥ క॥ తలయంటుకోనఁగఁ దఱియని। చెలిమొక్కతె క్రీడితోడఁ జిలుకయెలుంగుం, గలకలమనినగు జిలిబిలి। పలుకుల వలపాలయ విన్నపంబొనరింపన్॥ ౧౪॥ కం॥ ఇదెవత్తుమీవుపదమని। కదలియనుఁగుఁజెల్మికాని నైదండంబెం। పొదవఁగఁగొని విప్పచ్చుఁడు। కదనెంజలకంబులాడు గరుడలచవికెన్॥ ౧౫॥ వ॥ అట్లు కదనియచ్చట నెచ్చెలిమికానితో ముచ్చటలాడుచుండ॥ ౧౬॥ చ॥ పలుకులలాగు నెమ్మొగము బాగునుమీసము నూగునొక్కనై। యలరుటకోర్తెయబ్రపడి యప్పటి పాఱునిఁగానెఱింగి నె।చ్చెలిగమిఁజేరిచెప్పె మనచెంగటనున్ బుపుఁదోటనేరిమిం। బలికినయల్ల బూటకపు మాటలమాట యితండెయంచటన్॥ ౧౭॥ క॥ తనగుట్టుబయలఁబెట్టక। పనిచేయఁగనొడయఁడెంత వడిగలవాఁడే। ననబోడిగుట్టరయనీ। యనసింగారించి పంపెనని నగిరిచెలుల్॥ ౧౮॥ ఉ॥ ఆయెడ నింతియోర్తు మదినాగకకోర్కులు క్రేళ్లుదాటనే। మాయనఁబోపునెచ్చెలిని మోవిపయిం జిఱునవ్వుమొల్కలే। పైయిగురొత్త గన్పయిగనల్లనమూనిచి జారుపైటచం।దోయికిఁ దార్చుచుంబలికెఁ దొంగలిఱెప్పలనొప్పలీనఁగన్॥ ౧౯॥ గీ॥ మేలుగూర్చిన వారికి మేలెకలుగుఁ। గావునను మనమీజన్నిగట్టునిపుడు। తోడ బెండ్లికొడుకుఁజేయఁ దొడరవలయు। మనపుగూర్చినపనికిఁగా మగువలార॥ ౨౦॥ గీ॥ అనిన మునిమునినగవుల నల్లఁబూని। యొండొరులమోములనుజూచి యొక్కరొకరు। కన్నుసైగలనేమేమొ యెన్నుకొనిరి। క్రీడియనుగూర్మి సంగడికాఁడునంత॥ ౨౧॥ గీ॥ తేటరతనంపుముక్కలిపీటతెచ్చి। వింతకపురంపుఁ బొడులతోఁబెట్టినట్టి। మ్రుగ్గులోపలవేయంగఁ బుడమిఱేఁడు। వచ్చికూర్చుండె నద్దానిపైనినపుడు॥ ౨౨॥ సీ॥ కురులు చిక్కులుతీసి క్రొత్తసంపెఁగనూనెఁ దలయంటెఁ జిలుకలకొలికియోర్తు। పచ్చకప్రముచాయ పసపునమేదించి నలుగిడెనెమ్మేను నాతియోర్తు। మంచిగందపుఁదావి మించిగుబుల్కొననటకలి తలనిడె నతివయోర్తు। బంగారుబిందెలఁ బన్నీరుగొనివచ్చి జలకంబులాడించెఁ జెలువయోర్తు। నీరుముమ్మాఱు తలచుట్టు నెఱయఁద్రిప్పి। తడవుమనుమని దీవించెఁ బడఁతియోర్తు। రతనములపీటదొవదిగి రాఁగనెదుట। నిలిపె బంగరు పావలు నెలఁతయోర్తు॥ ౨౩॥ సీ॥ జిలుఁగుచెంద్రికవన్నెచేలచెఱంగునఁ బెన్నెకుఁడియొత్తెఁ గన్నెయొకతె। గమ

గమవలపులు కడలముంచుకొనంగఁ బూసరుల్ సిగఁజుట్టి బోటియొకతె। పెళపెళలాడు దువ్వలువపిఁజెలువెట్టి వేసఁజేతికందిచ్చె వెలఁదియొకతె। రతనాలపనిమేలిరవణంపు గుంపులు నెమ్మేనఁగీలించెఁ గొమ్మయొకతె। పొలఁతియొక్కతె జవ్వాజిపూనె మేనఁ। జెలువయొక్కతె పన్నీరుచిలికెఁబయిఁ। పూసురటివీచెఁ దలిరాకుబోడియొకతె। నిలువుటద్దము నొకనెలంత నిలిపె ప్రేమ॥ ౭౪॥ గీ॥ ముద్దుకస్తురినామంబు దిద్దినొసటఁ। బెండ్లిపల్లకిలో నెక్కి విడిదె వెడలి। యరిగె వియ్యపువారింటి కచటమున్నె। మించుబోండ్లు చిత్రాంగదఁగొంచుఁబోయి॥ ౭౫॥ గీ॥ చలువనెలఱాల జలకంపుసాలలోన। మేలిమిపసిండిపీటపై మెలఁతనునిచి। తేటపళ్యెరమునఁ గెంపుదివ్వె పెట్టి। జవ్వనులు పాటపాడి నివాళియియ్య॥ ౭౬॥ ఉ॥ పయ్యెదజాఱఁ జెక్కుఁగవపైఁ జిఱుచెమ్మటలూరఁ బూసరుల్। కయ్యముగోర లేఁగవును గబ్బిచనుంగవ దూర జాఱుకొ।ప్పొయ్యన వీపుఁజేర వెసనూర్పులు పైపయిఁ గ్రమ్మ దేరఁ దా। నయ్యెడ నింతియోర్తు తలయంటఁదొడంగెను వాలుగంటికిన్॥ ౭౭॥ ఉ॥ హాయనివేడ్కఁ దావి వెలిఁబర్వఁగ సంపఁగినూనెయంటి క।ప్పైయిరిగుంపు పెంపుగెలువంగల నిద్దపుసోగ పెన్నెరుల్। హాయలుతీసి దువ్వి చెలువమ్ముగఁ జిక్కులువాపె నింతియో। ర్తామె డలేత కెంజిగురుటాకులగేరెడు కేలుఁదమ్ములన్॥ ౭౮॥ గీ॥ పునుఁగుజవ్వాది మేదించి పెనఁచినట్టి। తావి కుంకుమపొళ్ళతోఁదలిరుబోడి। మేనకలుగులు వెట్టెను మెలఁతయోర్తు। గబ్బిగుబ్బల ద్రేగునఁ గౌనువడఁక॥ ౭౯॥ గీ॥ సోలి సంపఁగినూనెచే సొమ్మసిలిన। పెన్నెరులనెడు తుమ్మెదపిండు సకుమ। వెసను సేదతేఱఁగ మందువేయుకరణిఁ। గురులకట కలియిడె లతకూనయోర్తు॥ ౮౦॥ గీ॥ పసిడిబిందెలఁ బన్నీరు పరుసనించి। చెలులు రతనంపుగిండ్లతో జలకమార్ప। నెఱులవెంబడి దిగజాఱు నీరుపొలిచెఁ। గ్రొమ్మొయిలు జోరునను వానగురియు ట్లు॥ ౮౧॥ చ॥ తలఁకొలుఁ దైనొక్కచెలి తాఁబెడఁగుం దెలిపట్టుబట్టచే గలపమునైనలందె నొకకన్నియ కస్తురిబొట్టువెట్టెఁ దా। వెలఁదుకయోర్తు నెన్నొసట వేనలిఁ బూవులుచేర్చె నింతియో। ర్తెలమినెలంతయొక్కరితె యింపుగఁగాటుకతీర్చెఁ గన్నులన్॥ ౮౨॥ గీ॥ విలువరతనంపుఁ దొడవులువెట్టి మేన। జిలుఁగుబంగరు కెంబట్టు చేలఁగట్టి। చెలులు గైసేయ నెలమితోఁ జెలువనవుదు। పెండ్లికూఁతును జేసిరి పేరటాండ్రు॥ ౮౩॥ వ॥ అంతఁ బెండ్లిచావడియందు॥ ౮౪॥ కి॥ లగనమిదె పెండ్లికూతును। నగుఁదేనని యొజ్జ బాపనయ్యలు చెలులన్। మిగులం దొందరపఱుపఁగ। ముగుదలు వరుగెత్తి రంతిపురికినొకటన్॥ ౮౫॥ చ॥ అడుగుల కెంపుడాల్పుడమి యత్తఱి నొత్తకయుండ నెత్తినా। మడుఁగులు కాళ్ళకుంబఱుచు మాడ్కినిబర్వఁగ నిల్వుటద్దముల్। బడిబడిఁ జెల్మికత్తియలఁ బ్రక్కలనిబ్బడిఁజేయ సిగ్గుతోఁ। బడఁతుక పెండ్లితిన్నెకడ వచ్చెను నెచ్చెలిపిండు తేరఁగన్॥ ౮౬॥ గీ॥ కలికి నెమ్మోము తేనికిఁ గానిపించ।కుండ ముసుఁగువ తైలయొండుపట్టి। వెలనెనయ్యది నిండుదేవెల్గునకును। మిగుల

మాటగు మేటిక్రొమ్మొగిలుకరణి॥ ౮౭॥ క॥ నలుగడలవాయిదక్కులు । చెలఁగంగాఁ జేరటాంత్రము నేసలుచల్లన్ । బలుదీవెనలిడఁబాఱులు । పొలుపుగఁజనెఁ బెండ్లియరుగుపొంతకు నోదన్॥ ౮౮॥ క॥ కొమరాలినప్పుడట నే।మముతో నా నేలకోఁడి మాం కన్యాం తు।భ్యమహం సం।ప్రదదే యని । యమరంగా ధారపోసె నల్లున కెలమిన్॥ ౮౯॥ గీ॥ తెలివలటుమీఁదమెల్లన తెలినువంప । మిగులసిగ్గున ముగుదయు మొగమువంచె। మగువచెలువంబుఁగనఁ గ్రీడిమొగము నెత్తఁ। బచ్చవింటిని మరుఁడును బైకినెత్తె॥ ౯౦॥ గీ॥ పడఁతిమిన్నలు తెలినల్లవంచినపుడు । కనులు మిఱుమిట్లుగొనఁ దళుక్కుమనియెఁ జెలువ। బయలఁ గాఱుక్రమ్మిన గొప్ప మొయిలునుండి। మించి వెలువడు క్రొక్కాఱుమెఱుముకరణి॥ ౯౧॥ గీ॥ తొయ్యలి పిసాళిచూపులన్ తూపుగములు। నూరగా నాటియుల్లు ముల్లూతలూచి। క్రీడివయిని వ్రేల్మిడి నిండుగెలుపు కాంచి। విరుల విల్తుఁడు కోయని పేర్చి యార్చె॥ ౯౨॥ చ॥ సరగునఁ గొమ్మనెమ్మొగము చాయలకుం జని సేదతేఱి ని।బ్బరమగు నేణిచూపుగవ పైకొకచోటికి సాఁగఁ జూచియున్ । గురులనుచిమ్మచీఁకటిఁ దగుల్కొనియాడకె దారితప్పి బల్।మురిపెఁపు నవ్వువెన్నెలవెలుంగున వచ్చుచునుండెఁ గ్రమ్మఱన్॥ ౯౩॥ ఉ॥ వేఱొకచోటికిం గదల వేమఱు వెల్వడియందఁబోవఁగా। నేరక క్రమ్మరన్మొగము నే వడిఁజేరెడు చూపుమొత్త మొ।య్యారపుఁ జన్నుఁగొండకడ నవ్వలఁ దప్పులఁగాంచి వానిఁ బొం।గారఁగ నానవాలుగొని గంతిడి పాయకనిల్చె నచ్చటన్॥ ౯౪॥ వ॥ అటుపిమ్మట॥ ౯౫॥ చ॥ మురుగులు జారఁ జెమ్మటలు ముద్దుమొగంబునఁ గార ముత్యపు।స్సరులు కరోరఁ జేరఁ జిఱునవ్వులు మొల్కలు దేర నంటుజో। ల్లిరుదెసలందుఁ జెక్కులపయి న్వడిఁదూఁగుచు డాలుఱాలు నా।దార తలఁబ్రాలువోసె నలతొయ్యలి యాఁదలమీఁద దోయిటన్॥ ౯౬॥ ఉ॥ కౌనసియాడ ముంగురులు గ్రక్కునఁ జెక్కులమీఁదఁగూడఁ బెం।పూనినగుబ్బదోయిపయినొక్కట పేరులు త్రొక్కులాడఁ బై।పైని బయింటయాడ నునుబంగరుగాజులు పట్టువీడ నా।చానయుఁ గ్రీడిమీఁదను వెసం దలఁబ్రాలను బోసె దోయిటన్॥ ౯౭
క॥ మదిలోపలఁగలకూరిమి। నిదె నేఁబయిచేయియగుదు నిదెయేనగుదున్। వదలక కమఁడనుక్రియ వా।రొదుగక తలఁబ్రాలుపోసి రొండ్లోరులపయిన్॥ ౯౮॥ గీ॥ ఒండొరుల మేనుసోఁకుట నొక్కసారి। కన్నెకును నేనికిని మేను గగురుపొడువఁ। దాళిఁగట్టె నాతఁడు జవరాలిమెడను। నేలవేల్పుల దీవెనల్నింగిముట్ట॥ ౯౯॥ గీ॥ అగ్గినెలకొల్పి మటి వారలందులోన। నేయి వ్రేల్చిరి పిమ్మట నేలకోఁడు।వట్టి సన్నికల్ ద్రొక్కించెఁ బడఁతిచేత। నంత పేలాలు వ్రేల్చె నయ్యంతిమిన్న॥ ౧౦౦॥ సీ॥ ఎలుఁగెత్తి పాడెడి యింపైనపాటలు గండుకోయిలపిండు గరువమడఁప। పలుకునవ్వుమతోచు వల్వాఱుసలడాలు నలువలంకులను వెన్నెలలనింప । వళ్ళెమందలిదివ్వె బటువైనమగఱాల మెడపేరులకుఁ గెంపుబెడఁగుసూర్ప । మేనిబంగరునిగ్గు మేలిమిబంగారు వళ్ళెరంబునకును బసిమిరా.

సఁగ। వారిమోముల కెనరామిఁబట్టి నెలను । దిగఁదుడుపు పెట్టుకై వడి మొగములకును।
జెలికిఁ జెలువునకుఁ జిరంటులలరు వేడ్కఁ। గప్పురపుటారతులనిచ్చి రొప్పమీఱ॥౧౦౧
గీ॥ మొదటినాటితంతు ముగిసినపిమ్మటఁ। బాకెనయును నాగవల్లిమఱియు। వేఱ జరగ
వలయు వేడుకలెల్లను । వరుసజరిగె నెల్లవారు చెలఁగ॥ ౧౦౨॥ గీ॥ నాగవల్లియు
లోనుగా నడచినంతఁ। బెండ్లినాడులు గడువంగఁ జేర్మితోడ। నాలుమగలను గలుపంగ
నపుడుతలఁచి। మేటివేడుక నాలవనాటిరేయి॥ ౧౦౩॥ సీ॥ కమ్మతావులుగ్రమ్ము కపు
రంపువిడెములు పసిఁడిపళ్ళెరములఁ బొసఁగనుంచి। కస్తురి జవ్వాజి గందంబుఁ బన్నీరు
రతనంపుగిండుల రమణనించి। పటికంపుగోడల పజ్జనిర్వంకల నిలువుటద్దంబులు నెలవు
కొలిపి। పగడంపుచనుగోళ్ళ పచ్చలపీటపై వట్టివేళ్ళసురటి పెట్టియుంచి । వెండితబ
కులఁబండ్లు వేర్వేర పెట్టి। గొప్పరతనంపుదివ్వెలు కుదురుపఱచి। మేలిచొక్కపు బంగా
రుమేడలోని। వింతగదిని సింగారించి రింతులంత॥ ౧౦౪॥ గీ॥ పడకగదిలోని రతనంపుఁ
బసిఁడికోళ్ళ। దోమతెర పట్టెమంచంబు పైమెఱుంగు।టంచు దూదిపాన్పునఁ బవ్వళించి
యుండె। నతివరాకను మదిఁగోరియల్లుఁడు॥ ౧౦౫॥ వ॥ అంతకుమున్న॥ ౧౦౬॥
చ॥ కలపమలంది నెన్నొసటఁ గస్తురిబొట్టమరించి చేరలన్। గొలువఁగఁజాలు కన్నుఁ
గవకుం దగఁగాటుకవెట్టి క్రొవ్విరన్। వలపులుగ్రమ్ము పూసరులు వావిరిఁజుట్టి పసిం
డిపుట్టముల్। జెలువుగఁగట్టి చెల్వఁగయిచేసిరి సొమ్ములువెట్టి నెచ్చెలుల్॥ ౧౦౭॥
గీ॥ చెలులుకయిచేసి తరలింప సిగ్గుకతనఁ। బడఁతినెమ్మోమువంచి తానడువకున్న।
బుద్ధులనుజెప్పి మఱిమఱి బుజ్జగించి। పూవుబోడులు బలిమిమైఁ బొదిగిపట్టి॥ ౧౦౮॥
క॥ ననబోడి నొకటలాగుచుఁ। బెనిమిటికడఁజేర్పఁ దివురవింతగ నాజ।వ్వని తాఁబోక
పెనంగినఁ। గనుఁగొని యొకచెల్వయనియెఁ గన్నులనగుచున్॥ ౧౦౯॥ గీ॥ ఇచట
మాతోడఁ బెనఁగిన నెవ్వరిందుఁ। జూచిమెచ్చుదు రాతండచూచిమెచ్చ। బులుపుతీరం
గఁ బడకింటిపొంతఁజేరి। వెనుకతీయక మగనితోఁ బెనఁగరాదె॥ ౧౧౦॥ క॥ అనుట
యు సిగ్గును జెలిపైఁ।గినుకయుఁ జిఱునవ్వునొకట గిరికొన నపుడ।న్ననబోడి నట్టెపైచె
ను। గనుదోయిం గెంపుదోపఁ గైవిరిదండన్॥ ౧౧౧॥ గీ॥ చెలిమికత్తెలు చుంబుకు
సిగ్గొకింత । వెనుకకునుద్రోయ మెల్లన వెలఁదినడిచి। పడకయిలు చేరుతఱి మొలబంటి
సిగ్గు।ముంచి జాలువాఱుచుఁ దలమున్కయయ్యె॥ ౧౧౨॥ క॥ మిక్కిలి సిగ్గునమునిఁ
గిన। యక్కలికిం దలిమంబుచేర్చి యాచెలువ ల్వా।మొక్కొక్క సాకుననడిచిన। నక్క
మ్మయు మోమువంచి యళుకుచు నిలిచెన్॥ ౧౧౩॥ గీ॥ అంతటను గ్రీడి ముద్దియ
నల్లఁజేరి । మేనుచెమరింపఁ గెంగేలుమెల్లవట్టి । ముగుద విరిపాన్పపయికి రాఁదిగిచి
కొనుచు। వంచుకొనియున్న నెమ్మోము వయికినెత్తి॥ ౧౧౪॥ గీ॥ ఏలవెఱవంగ విరి
విల్తు నాలమునకు । నెంతపనికైన నేఁజాలి యిచటనుండ । నాదుప్రాపునఁ బెనగంగ
బాధయనుచుఁ । జెక్కుచెక్కునఁ దారిచిచెప్పఁజెవిని॥ ౧౧౫॥ గీ॥ ఏలవేయును

నప్పు డన్నెలఁతోనిఁ జేయి దామరకన్నియ చిన్నికౌను । తడవియును మీఁద మెఱుఁగు
గుత్తంపు గబ్బిగుబ్బలను ముట్టి మిన్నంది కొండఁ దాకె॥ ౧౧౬॥ ఉ॥ నెచ్చెలులేగినం
జనకనిల్చిన సిగ్గును తోనిపాలు కానిచ్చుట దోసమంచు నపుడే చనుగొండలలోన దాచి
విభ్వచ్చుని కేళటుం గదియవచ్చినఁ దానపెనంగి యేమిపై వచ్చునొయంచు దాచెఁ
బిదపం గను తెప్పలలోనఁ గూరిమిన్॥ ౧౧౭॥ ఉ॥ కవ్వడిచేయి పోకముడి గ్రక్కున
నావలఁజేరఁబాఱఁగా । జవ్వని యేమియున్నలుపఁజాలక బిగ్గన తానెచెల్వునిన్। నె
వ్వడిఁ గౌఁగిలించుకొనె నేర్పున తేఁటను సంతసిల్లి యా। క్రొవ్విరిబోడి కెంపెదవి
గొబ్బున గఁటిడి యానెఁ దేనియల్॥ ౧౧౮॥ గీ॥ క్రీడియామీఁదటను గిలిగింతగొలిపి।
చేతిపట్టును విడిపించి సిగ్గుమాన్పి । యింతి మరునాలమునకును నియ్యఁగొలిపి । కడపె
నారేయి యంతయు గడియవోలె॥ ౧౧౯॥ క॥ చెలువయుఁ జెలువుండును బూవి
లుతుని కయ్యముల నలసి వేడుకనుండన్। బెలుచనఁ గొక్కొరొకోయని । వెలువలఁ
దగఁగోళ్లకూసె వేఁకువ తెలియన్॥ ౧౨౦॥ గీ॥ తడవు రేతోనితోడను దనరియుండి।
వెడలఁబోయెడు తఱిని రేవెలఁది విప్పు। కొప్పునందుండి దిగజాఱి కూలినట్టి । విరులబంతి
నాఁ దోతెంచె వేఁగుచుక్క॥ ౧౨౧॥ చ॥ పగలొనరించు సాటిదొరవచ్చె దెసల్ వెసఁ
గ్రమ్మనంచు నెవ్వగఁదన తేజుగోలుపడి పాఱెడు చుక్కల తోనిఁ జూచి లోదిగులునఁ
దెల్విఁబాసెననఁ దెల్లపడెం గడుఱిక్కగుంపులున్। సొగసగునింటిదివ్వెలును జుక్క
లతోడనె తెల్విగోల్పడెన్॥ ౧౨౨॥ గీ॥ జగముచుట్టంబు రాకకుఁ జాలనలరి। పుడమి
వేల్పులు దీవించు మదుపులనఁగ। జెవులపండువు సేయుచుఁ జెలఁగఁజొచ్చెఁ। గరముఁ
బులుఁగులరొదలెల్ల కడలయందు॥ ౧౨౩॥ గీ॥ ఇరులవేటాడఁ దొలుదొల్త నేసినట్టి।
చిచ్చరమ్మనఁ దూర్పునఁ జెలఁగెఁ గెంపు। మలలకలుగుల దూరెడు నెఱుఁగులట్లు। చీకటు
లు కొండబొఱియలు దూరఁబాఱె॥ ౧౨౪॥ గీ॥ తమ్మిచెలికాఁడు చీఁకట్లఁదఱుము
వాఁడు। కలువగుంపుల సూఁడు రేవెలుఁగు జోడు। గాములకు నెకిమీఁడు జక్కవల
తోడు। పొడుపుకొండను జూపట్టెఁ బ్రొద్దుపొడుప॥ ౧౨౫॥ గీ॥ అంతకంతకు వింత
యొయ్యారమమర। నరమరలులేని వలపుల ననఁగిపెనఁగి। చెల్వుఁడును జెల్వయును
గూర్మిచెన్నుమీఱ। హాయిగానుండిరచ్చోట నాఱునెలలు॥ ౧౨౬॥ క॥ ఈలోపల నా
తొయ్యలి। చూలాలయ్యెను మగండుఁ జుట్టములు నెదన్। హాళింబొందగఁ దండ్రియుఁ।
జాలఁగొలమునిల్చునంచు సంతసపడఁగన్॥ ౧౨౭॥ క॥ చనుమొనలు నల్లపడియెను।
జనఁజనఁ బేవిళ్లు హెచ్చెఁ జవిమంటిపయిన్। గననయ్యె నెలలునిండినఁ। గనియెను ముద్దుల
కొమారుఁ గన్నియ యలమిన్॥ ౧౨౮॥ గీ॥ పుడమివేల్పులిడిన మంచిమూర్తమందు।
బభ్రువాహనుండనుచును బాగుమీఱఁ। బేరుపెట్టిరి యాపసిబిడ్డ కెలమిఁ। బెరుగుచుండె
నతఁడు తాతయిరవునందె॥ ౧౨౯॥ క॥ అని వైశంపాయనుఁడిటు। జనమేజయున
కుఁ గరంబు సంతసమొదలఁ। జెనయఁగఁ జిత్రాంగదకత। వినిపించిన వినియతండు

# SPECIMEN VERSES OF PURE TELUGU UTTARA RAMAYANA
## BY THE AUTHOR.

## శుద్ధాంధ్రోత్తర రామాయణము.

(ప్రథమాశ్వాసములోని పద్యములు.)

తే॥ గీ॥ రక్కసుల నోని తలలెల్లఁ జక్కఁజేసి। పుడమికూఁతును గైకొని వెడలి యట్లు। గాలికొమరుండు లోనుగాఁ గలుగువారుఁ। దమ్ముఁడును దోడఁజను దేర నెమ్మిమీఱ॥ ౧॥ చ॥ అరదము లెక్కి యక్కరణి నందఱుఁ గ్రందుగ వెంటనంటఁగా। సరగున నందినాఁ బరగు చల్లని పల్లియఁ జేరు వారిలో। భరతుఁడు ముందుగా నెదురువచ్చి యడంకువఁ గాళ్ళఁ ద్రావి తా। నరుదుగ వెంటఁబెట్టుకొని యన్నను బల్లియ కిచ్చఁ దెచ్చినన్॥ ౨॥ సీ॥ నారచీరలు విప్పి నాడెంపు వలిపెంపుఁ బట్టుపుట్టంబులు బిట్టు కట్టి। యడవి క్రొవ్విరులూడ్చి యందంపుఁ జెందమ్మి లరుదుగాఁ దుఱిమిన సరులు దాల్చి। వెడవెడ ముడివడ్డ జడలు సిక్కులు వాపి సిరిమీరు నునుజారు సిగలమర్చి। యొఱమట్టి నిడుపట్టె లెడలించి నుదురులఁ బదను కస్తురిబొట్లు కుదురుపఱిచి। మేలిరతనంపు రవణముల్ గీలుకొల్పి। తారు గైసేసికొని యెల్లవారుఁ బొగడఁ। దమ్ములిల్లాలు బంటులుఁ దానుఁ దఱలి। యొప్పు మీఱంగ రాముఁ డయోధ్య కరిగె॥ ౩॥ ఉ॥ అంతకుమున్నె వారలటు లచ్చటకుం జనుదెంచుచున్నలాగంతయు వేగ వేగకుల యాగక బాగుగ విన్నవించినన్। సంతసమంది ప్రగ్గడలు సందడిసేయుచు నూరివారలన్। గంతునఁ బిల్వనంపి సరగంజని ప్రోల్గయిసేయఁ బంచినన్॥ ౪॥ సీ॥ కమ్మకస్తురినీటఁ గలయంపి చల్లించి జిగిదేటపన్నీట జగతులలికి। యాణిముత్యంబుల నమరించి ముగ్గులు పందిళ్ళ కురువేళ్ళఁ బొందుపరచి। జాళువాపని మేలిమేలుకట్లలరించి పచ్చలదోరణాల్ బలియఁ జేసి। పసిఁడికంబముల సబ్రంపు టంటాలునిల్పి కప్రంపుఁ బొగలెల్ల కడలనించి। వీడు గైసేసి తామును వేలకొలఁది। పలువ సొమ్ములు దాలిచి చలువవలువ। లందమును గట్టి యుండఁ బ్రోలందమొందె। కరము కన్నులపండువు గాఁగనుండె॥ ౫॥ వ॥ అంత॥ మ॥ పదియాఱ్వన్నె కడాని మేడలపయిం బాలింక్లవొంగార నెమ్మదిలోఁ గోరికలూరఁ గ్రొమ్ముదులు పైపైజార లేజవ్వనుల్। కదియన్వచ్చుచునున్న రాకొమరు వంకం జూడ లోఁ బొమ్మియపం। జెదరంబారఁగ మీఁదఁ జల్లి రలరుల్ చేనిండఁ గీలింపుచున్॥ ౬॥ తే॥ గీ॥ వేల్పులాతంస తమ దాంప బింకమడఁప। వేల్పు ప్రమాఁకుల నెత్తావి విరులుగోసి। యలరిపయిఁ జల్లి పెల్లున నలరువాన। లెఱుచ లందంద సురియింపఁ దెరువుఁ దాఁటి॥ ౭॥ సీ॥ తామెల్ల నోచిన నోములు పండె నేఁటికటంచు నీటివారొకటనుబ్బ। నెన్నినాళ్ళకు నిన్ను నిటఁ గంటిరా కన్నతండ్రీ యని యనుంగు తల్లి యలర। నేలుమెల్లపుడు నీ నేల నీవేయని వెసదీవనలు నేలవేల్పులొసఁగఁ। బుత్తడిపళ్ళెరంబులు పూని ముత్తైదువలు

పాటపాడి నివ్వాళులియ్య। నిల్చిచోత్తెంచి తల్లులకెల్ల మ్రొక్కి। తమ్ముఁగలవారినందఱఁ దగినయట్లు। గారవముచేసి యతఁ డెల్లవారు మేలు। మేలని పొగడఁగా నేలయేలుచుండె॥ ౮॥ వ॥ ఒక్కనాఁడు॥ మ॥ ఒకచోట న్మృగజాలడాలడరి యెంతోయెండఁ గాయంగ వే।ఱొకచో ముత్యపునిగ్గువెన్నెలల చెల్వూనంగ నామీఁద నెం।డొకచోఁ గెంపులచాయ తిన్నియలువేయన్ సంజకెంజాయ పో।లికగా నొక్కెడఁ గప్పు టాగమి యిరుల్నింపంగ నాకొల్వునన్॥ ౯॥ సీ॥ చెలువంబుగానాఁడు వెలయాంధ్ర బంగారు చిఱుగజ్జియల మ్రోఁత చెవులుదనుప। విరిబోఁడులిరుగ్రేవ వింజామరలువేయ వెడలుచల్లనిగాలి విందుగొలుప। రహిమీఱఁ దాల్చిన రతనంపుపనిసొంపు తొడవుల తళతళల్ కడలునిండఁ। బగడాలకంబాల పజ్జముద్దిసుసుల కెంబట్టుపఱుపులు డంబుసూపఁ। గొలువనేతెంచు దొరలెల్ల గుములుగూడి। యవనికపుడాక నందంద యొదిగియుండి। యడుగుడోయికి మ్రొక్కుచు నవలనిలువఁ। బనిఁడిగద్దియఁ గొలువుండె బలియుఁడతఁడు॥ ౧౦॥ ఉ॥ అప్పుడు సుప్పతిప్పలుగ నాతనిఁ జూతమటంచు నెంచి వే। యొప్పులకుప్పలౌ తపసులుక్కున నక్కడకేగుదెంచినం। దప్పక చూచి లేచి తనదండను నజ్జడదారిపిండుకుం। జొప్పడు పెద్దగద్దియలు చుట్టును బెట్టఁగఁబంచి వేడుకన్॥ ౧౧॥ తే॥ గీ॥ ఎదురుగానేగి తోడ్తెచ్చి యెల్లవారిఁ। దగినచోటులఁ గూర్చుండఁ దగపుసలిపి। రెండుచేతులు జోడించి నిండుమదిని। నెంతయుఁ బొగడ్తలొనరించి యిట్టులనియె॥ ౧౨॥ క॥ నేమమె మీకున్ మీకడ। గోముననఁగల చదువులెల్లఁ గొను వడుగులకున్। నేమమె మెకములరాయిడి। మీమీనెలవులను లేక మేలొదవెడునే॥ ౧౩॥ క॥ ఎవ్వరు మీకుండొందర। లెవ్వరుగా మంచినీటి యెద్దడి యొపుడున్। రవ్వంతయు లేదుగదా। పువ్వులుకలవే గదసతమును గోనలలోన్॥ ౧౪॥ తే॥ గీ॥ తెరువు గనలేక డొసఁగులఁ దేలుమాకు। దారిచూపెడు తలఁపునఁ దపసులార। తలవని తలంపుగావచ్చి పొలుచుకతనఁ। గంటి మిమ్ముందఱఁ గనులకఱవుదీర॥ ౧౫॥ ఆ॥ వె॥ అనినఁ దేనెమాట లౌనని మెచ్చుచు। నొండొరులమొగంబు లాఱఁగిచూచి। యొక్క మాటగాఁగ నున్నవారందఱు। దిట్టతనముమీఱ నిట్టులనిరి॥ ౧౬॥ ఆ॥ గీ॥ అడుగవలసి యడిగి తండ్రియకాక నీ।వెఱుఁగనిదియుఁ గలదె యెందునైపుడు। నైన నిప్పుడదియె మా నోటఁబలికింప। వేడుకయ్యెనేని వినుము తెలియ॥ ౧౭॥ క॥ మీకడకంటనె చూచినఁ। గా కలుగున్ నేమ మిజ్జగములనన మఱుం। జేకొని ప్రోచుచు వింతగ। మాకయ్యది యడుగనేల మఱిమఱిచెపుమా॥ ౧౮॥ క॥ జగములకెల్లం డొందర। యగు రావణుఁ డీల్గెఁగాదె యనిలో నీచే। నిగనెవ్వరిచేఁ దొందరలగుఁ దగ మాకింట్లకెల్ల నప్పటి కరణిన్॥ ౧౯॥ సీ॥ ఎప్పుడుఁగంటిపై రెప్పవాల్చుటలేని జేజేలకిపుడుగా చేటుదప్పె। నయినవారిని బాసి యడవులఁ గూపెట్టు తపసులకిపుడుగా తాల్మి గలిగె। బిచ్చకానిచెలిమి యప్పువడ్డట్టి జక్కులదొరకిపుడుగా కలిమిగలిగె। గాలిబ్రతుకుఁజెంది కలుగులఁ

బడియుండు చిలువలకిపుడుగా తెలివిగలిగె । లేచియొకచోట నిలుకడలేకతిరుగు । చలువతెమ్మెరకిపుడుగా బలిమిగలిగె । నిపుడు నీపేరుచెప్పక నిలువఁగలిగె । జగములకు నెల్ల రక్కసుచావుకతన॥ ౨౦॥ ఉ॥ ఎందఱివానిచుట్టముల నెందఱిసంగడికాండ్రఁ బోరిలో। జిందరవందరల్వరపి చెండితి వింతకసేపులోన వా।రందఱు నొక్కఁగాఁదరమె యా నలుమోముల వేల్పుకైన నీ। వందఱిమించి తెవ్వరికనౌదురు నీసరి ముజ్జగంబులఁ॥ ౨౧॥ శా॥ అవ్వారందఱు నొక్కయెత్తుసరిగా నాయింద్రజిత్తొక్కఁడుం। జివ్వన్వేఱొకయెత్తుచూడ నతనిం జెండాడె నీతమ్ముఁడిం।కెవ్వాఁడట్టుగనోపు నమ్మగతనం బెండ్లైన మున్నంటిమే । నవ్వుల్ గావు సుమయ్య మావలుకులన్నన్నెమ్మదిన్నమ్ముమా॥ ౨౨॥ వ॥ అనిన రాక్షామరుం డిట్లనియె॥ ౨౩॥ చ॥ ఎటువలెనింద్రజిత్తునకు నింతగ నెక్కుడుబల్మికల్గెఁ దా।నెటువలె వేల్పుఱేనిని నెక్కటినోరిచెఁ దండ్రికంటె మి।క్కుటముగ బీరమెట్లొదవెఁ గూరిమిమీఱఁగ నానతీయరే। తటుకున వానిపుట్టువయుఁ దండ్రికొలంబు తెఱంగు రంగుగ॥ ౨౪॥ తే॥ గీ॥ మొదటినుండియు రావణు పుట్టుకయును। ముజ్జగంబులు నాతండు ప్రోడయగుచు। గెల్చిన తెఱంగుఁ దొలివేల్పు గొల్చువలయు। మెప్పులొందిన యొప్పును జెప్పవలయు॥ ౨౫॥ ఆ॥ గీ॥ అనినఁ గొలువు వారి యానతిఁ గైకొని। కడఁగివారిలో నగస్త్యుఁడంత । చెలువుగులుకు కలికి పలుకులు చెవులకుఁ। జవులువలుకురు వెదచల్లఁబలికె॥ ౨౬॥ సీ॥ వినవయ్యజడదారి వెలయుఁబులస్త్యుండు మొదటివేలుపునకు ముద్దుపట్టి । మచ్చరంబును గెల్చి మరునకులోఁగాక యాసనుదిగనాడి యలరువాఁడు। నిక్కంబుతప్పక యెక్కుడు తెలివిని నీరసంబెఱుఁగక యొప్పఁగువాఁడు। తొలివేల్పు టుక్కంటి వలదురిదాల్పుల నిచ్చలుమదిలోన నిల్పువాఁడు। వల్లమాలినపూనిక తోనిల్లువెడలి। చలువగాలి పెడ వలిమల కెలననలరు । చెలువుగులికెడు తృణబిందునెలవుచేరి। తపనితనమూని యున్నంతఁదారసిల్లి॥ ౨౭॥ చ॥ అలరులకొమ్మలో మరునియమ్ములో బంగరుకీలుబొమ్మలో । వలపులదీవులో తావలబావులో చక్కని గుజ్జుమావులో। తొలకరిమించులోయనఁగఁ దూకొని యచ్చరలేమలచ్చటఁ। దళుకుకనుంగవల్ తళుకుబెన్దొడలుం దగసందడింపుచుఁ॥ ౨౮॥ సీ॥ ఒకచోట మః పాట లొకతేటగాఁబాడుదురు నల్లపూతెల్లఁ గరఁగిపార। నొకయొరవగమీర యొకమోరగనొనర్తు రలమిదట్టంపు వెన్నెలలుగాయ । నొకచాయఁ గనుకాయలకు దాయవత్తు రొయ్యారంపునడకల హావునునిండ। నొకదండవిరిమండలాడినిండఁ గూర్తురు కమ్మనితావులు గ్రమ్ముకొనఁగ। బిలుతురొకచక్కి నెచ్చెలిపిండునిక్కి । కలికిపలుకుల చిలుకలు కలఁగిచూడ। నడుతురొకక్రేవ సొలపుగా నడిమి త్రోవఁ । గదియనరుదెంచి యంచలు కాళ్ళఁబెనఁగ॥ ౨౯॥ తే॥ గీ॥ బటువుబిగిగుబ్బలరదొఁపఁ బైటజార । మది తలంగఁగఁ గందువమాటలాడఁ। జూడ్కిమిఱుమిట్లుగొనఁ జెంతఁ జూరవమొలఁగ। గలయుఁదిలకించి జడదారికళవళించి॥ ౩౦॥ చ॥ అటునిటుమ్రొలవేల్పు జవరాండ్రు మొ

లంగుట వెంచిచూడఁగా। నేటులునుదానునైకొనిన యిప్పటిపూన్కికే నద్దువాటుగాఁ।
దటుకున నల్లమందెత్తఁగి తాళఁగఁజాలక వారినందఱిన్ । దిటముసఁజేరఁజీరి వెను
తియ్యని తియ్యనితేటమాటలన్ ॥ ౩౧॥ శా॥ ఏలావేయను గొమ్మలారవినుఁడీ యీ
మీఁదనీతోఁటలో। వాలారుంగనుదోయివిచ్చి మరియేవాల్గంటి నంజూచునో। యీలే
జవ్వని యిప్పుడేయిచటఁ జూలాలౌనటంచాడినం । జాలుంజాలునటంచు నాటవల
పుల్ సాలించివారందఱున్॥ ౩౨॥ క॥ వచ్చినదారినెపదరే । యిచ్చటఁ దలయెత్తి
చూడ కెచ్చటికైనన్ । మెచ్చఁగవలదాత్రోవనె । వచ్చినపనియయ్యెనంచుఁ బకపక
నగుచున్॥ ౩౩॥ క॥ ఇంతటితోసరిపెట్టెను। గొంతతలలు తడవిచూచుకొంటిమి బళి
రే। యెంతటినోములునోచితి । మింతిరో మనతోంటిపేననే యనిచనుచున్॥ ౩౪॥
చ॥ వడివడిఁబారుతెంచి యొకపైదలి యార్పులువుచ్చి నవ్వినం। బడఁతుకయార్తుచా
లిపుడె నవ్వకుమంతయు పేపెగట్టిగాఁ । గొడుకులతల్లిపొదువాక కొంచెమునాఁటికి
దాచుకొమ్ము నాపుడికెనెలంతయుం గడుపులుబ్బఁగనవ్వి కొమ్మలందఱున్॥ ౩౫॥
క॥ ఒక్కతె చనుమొనకస్తురి। నిక్కఁకనఁగవచ్చు చెలికి నిలుమని మొక్కన్ । విక్క
చుఁగొమరునొగనుమని । చక్కనదీవించె వీపుచరచుచుదానిన్॥ ౩౬॥ తే॥ గీ॥ ఇట్లు
మేలంబులాడుచు నింతులెల్ల। నెడగలుగఁబోయిరంతట నిచటఁ బాలు।గోయుఁ దృణ
బిందుగారాపుఁ గూతరసుఁగు । చెలియతోఁగూడి పూదోఁట మెలఁగుచుండి॥ ౩౭॥
క॥ మునుపటు బెట్టిదముగ నా।యనవాక్రుచ్చుటలు విన్నయదిగా దటుగా।పున వెఱ
వన్నదియెఱుఁగక। వెనుకయుముందుం దెలియక విచ్చలవిడిగన్॥ ౩౮॥ సీ॥ వేనలి సం
పంగి విరులనెత్తావికిఁ దెమ్మెరల్ దరిచేరఁ దేంట్లువారఁ । జక్కనినెమ్మోము జాబిల్లి
జిగికిని నెఱపొల్తరంగఁ గల్వలు చెలంగఁ । దనమేనిజవ్వాజి తావికిఁ బునుఁగుపిల్లులు
డాయ రాచిల్కలులికికూయ । నలువైనక్రొవ్విద నల్లమబ్బునకును నెగసియంచలు
వీడనెమ్మిలాడ।విరులుద్రుంచుచుఁ దేనియల్ వెదకికొనుచుఁ। బంగ్లరాల్పుచుఁ గెందమ్మి
తూండ్లఁగొనుచుఁ। జానసింగారముల తోఁటలోనఁదోడి। చెలియనెడబాసి యొకకొం
తసేపుతిరిగె॥ ౩౯॥ క॥ బోటింగానక యావిరి।దోఁటం దిరిగితిరిగి యటుదోఁచక
యొంటిన్। మాటికెలుఁగెత్తిచీరుచు । మేటితపసిఁగాంచె నొక్కమెలపున నెదురన్॥
౪౦॥ ఉ॥ చెక్కులుతెల్లవారెఁ గనుచిన్నియయారపుఁ గొనమీరెఁ జన్నుక్కల
నల్పునేరె జిగిపూవనిగారవుఁ జన్నదోయి వెం।పెక్కువతేరె దట్టమయి యొంకయు
నారలరారె నూరుపుల్। మిక్కిలియారె నత్తపసి మిన్నఁ గనుంగొని నంత నింతికిన్॥
౪౧॥ తే॥ గీ॥ అక్కఱకదానఁ జాలింతరాలితనము । పూనుటకుఁజాల పదిలోనఁ
బొగిలిమొగుడ । దానికిఁగతంబు పరికించికానలేక । యచటిమండల నయ్యోఁగాకంచు
నెంచి॥ ౪౨॥ తే॥ గీ॥ ఇంకనేమందు నట్టివానింటఁబుట్టి । నేఁడు పేరుపెద్దఱికంబు
నీటఁగలిపి। వట్టిరట్టులుపడ నొడికట్టుకొంటిఁ । గటకటా యిది నావంటికన్నెకగునె॥

౪౩॥ క॥ మిక్కిలికటికితనంబున। నక్కటికములేక నుదుట నాకట్టిడి వే।ల్పిక్కరణి
మూఁడుబంతుల। నక్కట నావంటిదానికా వ్రాయుటతాన్॥ ౪౪॥ క॥ ఇదివిన్న
యమ్మలక్కలు। మొదలంగానిత్తురె యింకమీఁదట నన్నున్। మదినేరమెంచుఁదండ్రి
యుఁ। బదుగురిలో వట్టిరవ్వ పాలైతింగదా॥ ౪౫॥ క॥ చెలులుం బుగ్గలువాడుతురు।
నలుగురిలో నవ్వుబాట్లు నాకనిఘటియుం। దెలివొంది తండ్రికడకా। చెలువతుదకు
గుండెజాయి చేసుక యరిగెన్॥ ౪౬॥ క॥ అటువంచినతలయెత్తక। బొటబొటఁ
కన్నీరుగార బొటవ్రేల్నేలం। జిటుకున వ్రాయుచు మేనొ।క్కట గడగడవడఁకఁదండ్రి
కడ నిలుచున్నన్॥ ౪౭॥ తే॥ గీ॥ కొంతవడికిని దలయెత్తి కూఁతు నెదుటఁ। జిన్నవో
యినమోముతో నున్నదాని। నట్టితిలకించి యుల్లమిట్టట్టులూఁగ। డెందమున నింత సం
దియంబందివలికె॥ ౪౮॥ క॥ పువ్వుంబోఁడిరో యెవ్వని। కవ్వలనేయెగ్గొనర్చి తండట
లోనన్। రవ్వగనూర్వంజాలక। యెవ్వఁడు నిన్నిట్టుతిట్టె నించుకలోనన్॥ ౪౯॥ కం॥
నాముందట నీకీ వెట।పేమి ననుఁగన్నతల్లి యిప్పుడిచట నీ।వేమియుఁ గొఱంతనై
చామా యింకఁదెల్పవమ్మ జరిగినదెల్లన్॥ ౫౦॥ ఆ॥ గీ॥ బ్రదికినంతతడవు పరువా
యె లేక। తల్లిదండ్రులెపుడుఁ దలలువంపఁ। బుట్టరాని యాఁడుపుట్టువుఁ బుట్టియ
గాని చేత కేల కడఁగితమ్మ॥ ౫౧॥ క॥ మునుపటితెలివెల్లను జా।వ్వనిరో యిపుడెందుఁ
బోయె వగచెదు నిన్నే।మన నెన్నటికిం దఱుఁగని। పెనురట్టడి మాకుఁ దెచ్చిపెట్టితివని
నన్॥ ౫౨॥ చ॥ వెలవెలవోయియచ్చెలువ వేమఱువెల్వడి జాలువారుకన్। గలువల
వేఁడినీటఁ గనుకందినకాళ్ళకు నేదదీర్చుచుం। బలుకులవిన్నఁబాటొదవ మైచెమరింప
నెలుంగురాల్పడం। బలికెఁ దమంతరాచిలుక బారులుచేరువఁబాఱుతేరఁగన్॥ ౫౩॥
శా॥ తండ్రీ కొండొకదోసమే నెఱుఁగఁజూ తప్పెన్నమీఁయూన పెక్కండ్రీ త్రోవను
బూలుగోసికొని యేగంజూచి డెందంబులో। వేండ్రంబౌ తమి పెల్లిదంబడపకే విచ్చేసి
యూతోఁట నిల్లాండ్రందెల్లను వానిగన్నచెలితో నందంద నేఁగ్రుమ్మరన్॥ ౫౪॥
తే॥ గీ॥ ఏకతంబునఁ జెరలాడ నేకతంబొ। కాని,యటనాకుఁ జెలిచెంతలేనితఱిని। నిట్టి
చూలేర్పడియెఁగాని యింతకన్న। వేఱెఱుంగను మీయాన వేయునేల॥ ౫౫॥ తే॥ గీ॥
అనినలోపలిచూపున నరసినిజము। కన్నుఁగవ మ్రోలఁగట్టిన కరణిఁదోపఁ। జానయెడఁ
దప్పులేమికి సంతసించి। కూఁతుఁగనిపల్కెఁ గూరిమి కొనలుసాగ॥ ౫౬॥ క॥ అమ్మా
యూరకనీపై। నిమ్మాడ్కిన్ లేనిపోని యీనేరము నేఁ। జిమ్ముట తప్పగఁబట్టక।
యుమ్మలికము మానియుండు ముల్లములోనన్॥ ౫౭॥ క॥ తనుఁగనుదానికిఁ గడు
పొ।సనుచుఁ బులస్త్యుండువలికె నది యింతెఱుం।గనికతమున నీవాతనిఁ। గనుఁగొంటి
విగానఁ జూలుగలిగెన్నీకున్॥ ౫౮॥ క॥ ఇంతటిపనికేఁ గలుగఁగ। వంతలఁ దలకంగ
నేల వలవదు నీకా।వంతయుఁ గొఱంతలేదిఁకఁ। జెంతకురమ్మంచుఁ గూఁతుఁ జేరఁగఁ
బిలిచెన్॥ ౫౯॥ తే॥ గీ॥ పిలిచితొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని యు।తండు బుగ్గ

బుముద్దిడి నిండుతమిని । గొప్పదువ్వుచుఁ బయిచీరకొంగుతీసి। కనులనీరొత్తి తడవుగఁ గౌఁగిలించి॥ ౬౦॥ చ॥ చనువున లేవనెత్తి యెలజవ్వని కేలొకచేతఁబూని గొబ్బునఁ దనవెంటఁబెట్టుకొని పోయి పులస్త్యునిఁ గాంచి మ్రొక్కి యా। యనకు వెలందిఁ జూపి తగ నప్పటికట్టడి నింతి చూలుదాల్చినదగు లేర్పడంబలికి చేతులు రెండునుఁ జేర్చి యిట్లనున్॥ ౬౧॥ తే॥ గీ॥ తపసిమైయున్న ముక్కంటికపుడు కొలువు। గట్టు రాకన్నె చేసిన కరణినిపుడు । తపసిమైయున్న మిమ్ము నీతలిరుబోడి । నమ్మికొలుచును బెండిలి కమ్ము దీని॥ ౬౨॥ క॥ ఎండలబడలినయప్పుడు। పండాకలి గొన్నయపుడు మాకొక ప్రాపై। యుండి తనయండనిడుకొని । పండులొసంగు లతకూన బడలికలడఁగన్॥ ౬౩॥ తే॥ గీ॥ అనుచుఁ జేతిలోఁజేయివెట్టి యప్పగించి । యతఁడు గైకొన్నపిమ్మట నల్లునొద్ద। నెలవుగైకొని కూఁతును నిలువఁబనిచి। లేచి తనయింటి కేగె నారాచతపసి॥ ౬౪॥ క॥ అదిమొదలుగ నాకన్నియ । వదిలముగా మగనికూర్మి వడయంగఁ దలం। పెదలోఁ బొదలఁగ నాతని। మదిలోపల మెలఁగుచుండె మఱపెఱుఁగనిదై॥ ౬౫॥ సీ॥ ఎపుడుఁ బ్రొద్దునలేచి యేటమునిఁగి యింటి కేతెంచునంతలో నెదురువచ్చి । యడుగు కెందమ్ములు కడిగికొనఁ బసిండిచెంబున నీరందిచెంతనునిచి। వరుగునఁ దననుసైటచెఱంగున నడుగులుతడియొత్తి యంతలోన। నుతికినతెల్లదోవతులు పింజెలువెట్టి చని చేతికందిచ్చి సరసనొక్క। పీటవెట్టికూర్చున్నచోఁబెరటచున్న। పువ్వులొకపళ్ళెరంబునఁబోసి యొసఁగి। వార్చియాతండులోనికివచ్చునంత। పిండివంటలతోఁగూడ వండిపెట్టు॥ ౬౬॥ తే॥ గీ॥ ఆరగించెడుతఱినొకయోరనిలిచి। విసరుపీవనచేఁబూని వెనుకఁబూల। పానుపొక్కటి సవరించి పవ్వళింపఁ । దొడలపైనిడుకొని మెల్లనడుగులొత్తు॥ ౬౭॥ క॥ నడిరేయియైనఁ బలువురు। బడిబడినడతెంచి రేని వారికిసరిగా । గుడువంగఁ బెట్టునప్పుడు। ముడికట్టుకవంటచేసి మరియాదమెయిన్॥ ౬౮॥ తే॥ గీ॥ అదునతప్పకుండఁగ నోరె మమరుచుటకు। నింటితీర్పునఁ దనుమఱపించుటకును। దపసియంతవాఁడును జూక్కెఁ దలిరుబోండ్ల। యిచ్చకంబులఁబడనివారెవ్వరింక॥ ౬౯॥ వ॥ అట్లు॥ తే॥ గీ॥ కూర్మిమగఁడు కన్నులఁగప్పుకొనఁగ నుండి । యంతకంతకు వేవిళ్లువింతమీఱఁ । జాల కనిగాటులుగఁ దిండి సలుపఁజొచ్చె। నెలలునిండె నీళ్ళాటప్రొద్దులును దాఁనె॥ ౭౦॥ క॥ ముగుదయొక మంచినాటను। మగవానింగనియె మగఁడు మదినుప్పొంగన్। మగవానిఁగన్నతండ్రియు। మగువంగన్నట్టితల్లి మక్కువపడరే॥ ౭౧॥ సీ॥ ఏతొందరయులేక యెలమితోఁ జుట్టములెల్ల నిండువేడుకఁజెందరెండుతలలు। కుదురుగా నేర్పడి పదినాడులును జన్నముఱునాఁడు పురిటినీళ్ళలరిపోసె । యిరువ దొక్కటవనాఁ డెదఁదలపోసి పెద్దలుపెట్టిన యొక మూర్తంబునందుఁ। బరతెంచితపసియు విరిబోఁడియును బారసాలపీటలమీఁద సంతసమునఁ। గూరుచుండఁదండ్రి కొమరునకప్పుడు । విశ్రవసుఁడనంగఁ బేరువెట్టి । నాఱవ నెల నోరె మమరంగముట్టించి। వడుగు నేడులేడు గడువఁజేసె॥ ౭౨॥ చ॥ పితృషుని

మాడ్కి విప్రవుఁడు పిన్నటనుండియు మెండుదండియై । జతనము హెచ్చ మచ్చరముఁ
జంపి వడింజడదారి దారిఁ దా। నతివలమానిపూని తనసందటు నందరు వందిచూడఁగా।
సతమును గానలోన రెయి సైతము నీతమునిండ నుండఁగన్ ॥ ౨౩॥ క॥ పుడమి భర
ద్వాజుండను । జడదారియొకండు తనదు చక్కనిబిడ్డన్ । వడిదేవవర్ణియనియెడు।
పడఁతుకఁ దోడ్కొనివచ్చి పలికెం బెరిమన్ ॥ ౨౪॥ సీ॥ చెలువకన్నులడాలు చెంగల్వ
విరిచాలు నిసుమడింపఁగఁ జాలు నింపునింపుఁ। గొమ్మపొక్కిలి పెంపు కమ్మతావులనింపు
పొన్నక్రొన్ననసొంపు పొలుపుఁ దెలుపు । మగువపన్నులతీరు మల్లెమొగ్గలపేరు లోనఁ
గూర్పఁగను గోరు సొబగు నెబగుఁ। జానచక్కనిముక్కు సంపగిపువు టెక్కు దాపునఁ
జెయిచిక్కు నేపుఁ జూపు। నువిదచేతులు పూదండలొసఁగుచుండు। నింతి నెమ్మోము
విరిదమ్మి నెలమిఁ గూర్చుఁ। బూజసల్పెడు తటియందు బూఁని మీకు। గట్టిగా సన బోడిఁ జేపట్టు
వలయు॥ ౨౫॥ మ॥ అన నెమ్మోమునఁ జిన్నన వ్వొలయ నెయ్యారంబుగా లేచి యా।
యనవెంటం గొని తల్లితండ్రులను డాయంబోయి కాన్పించి వచ్చినకర్జంబు కరంబు
వీనులలరం జెల్వంబుగా విన్నపం। బొనరింపన్మది నుబ్బి మైకొనిరి వారొండాడఁగా ౯॥
త్రులే॥ ౨౬॥ ఉ॥ అంతనొకింత మంతనము నందుఁ గొమారుతలం పెఱింగి వారెందర
యు సంతసంబడర నింతిఁ గొనం దమడెందమందు నొక్కింతయు నడ్డులేమి యెన్నలవి
గించిన మేలని వారుఁ దారునున్ । వింతగ వియ్యమొందఁగను విందుగ నందఱు నందు వను
బొందుగన్ ॥ ౨౭॥ సీ॥ తమ్ములమ్ములనంది తరువాతనిరువురు బట్టలొండొరులకుఁ గట్ట బో
బెట్టి। పెండ్లిపనులు చేసి పెద్దలరావించి తమవారితోఁ గూడి తరలి వెళ్లి। వియ్యపువారిదెం
విడిదెలో పలదిగి నాల్గునాడులతంతు నడపిమఱియు । నలుకపానుపు మొదలైన వేడుక గ
లెల్ల జరుగవలసినట్లు జరుగనలరి । నాగవల్లియైన నాఁటిరేయూరేగి । యొప్పగింతలైన
యప్పు డగవు తగవు లరణములును దగినయట్టులొసంగి । పెండ్లికూఁతువారు బిడ్డ
నిచ్చి॥ ౨౮॥ తే॥గీ॥ అంపకము సేయఁ బైనమై యపుడకదలి । పెండ్లికూఁతుతోఁ గూ
డ నా పెండ్లికొమరు। నొక్కపాలకి నెక్కించి యుబ్బుమీఱ। నింటికే తెంచెను బులస్త్యుఁ
డింపుమెఱసి॥ ౨౯॥ క॥ పిల్లది పెద్దదియైనం। దల్లియుఁ దండ్రియును వచ్చి తమముచ్చ
ట పెంపెల్లను దీరఁగఁ గొమరెకుఁ। గొల్లగసొమ్ములిడి కోర్కె కొనసాగంగన్ ॥ ౩౦॥
క॥ పెనిమిటి పెండ్లాముల మంతనమున నొకటిగ నొనర్చి తలిదండ్రులు వేడ్కను దమ
యింటికిఁ బోయిన । వెనుకం జూలేరువడియె వెంఁదికి నిచటన్ ॥ ౩౧॥ క॥ అన్ననబోడి
కడుపునం। బున్నమచందురునివంటి బుత్తుఁడు వొడమెన్ । గ్రొన్నెలబాలుపు నాలికి।
మున్నలకొమరుండు నెమ్మిఁ బుట్టినపగిదిన్ ॥ ౩౨॥ ఉ॥ ముద్దులమూటగట్టు సలబొట్టియ
పుట్టుకయప్డు వేలుపుం। బెద్దపులుంగు తత్తడిని వేడుకమీఱఁగ నెక్కి వచ్చి వీ। దద్దసలేలు
నేలికలయం దొకఁడై మఱి రొక్కపుం దొరా । నద్దిర ఏసిపుస్నమని యానతియిచ్చి
ఘనెం దనంతటన్ ॥ ౩౩॥ చ॥ వడిగొనరించి యామొదలు ప్రాఁజదువుల్ చదివించి

తండ్రి నేర్పడరఁ దనంతవానిగను నన్నిటఁబెద్దిప నారితేరుటన్। విమవనిపూన్కిఁ గాలి బొటవ్రేలూకయుంచుక నేలమోపి నట్టడవిని నొంటిమైఁ దపస్వియై యతఁడుండెను దండ్రి పోలికన్॥ ౬౪॥ క॥ వేయేడులు నీరానియు। వేయేడులు గాలిఁగ్రోలి విడువక యాపై। వేయేండ్లొగిరమొల్లక। యాయడవిం దమ్మిచూలి నతఁడు తలంపన్॥ ౬౫॥ ఉ॥ నిద్దపుఁబండువెన్నెలల నిపెంపుసొంపగు ఱెక్కఁద్రెక్కలన్। ముద్దుమెఱుంగుదీగియలఁ బోలినబంగరురంగు చారలం। దద్దయుమించునంచపయిఁ దామరచూలి కరంబు డంబుగా। నొద్దకువచ్చి యచ్చెరువు నొందికనుంగొని నింగినిట్లనున్॥ ౬౬॥ క॥ ఎమ్ములు దక్కఁగనొక్కటి। నెమ్మేనంగానరాదు నిలువెల్లఁ జెదల్। గ్రమ్మెను మెచ్చితిఁ దామ్మికిఁ। గొమ్మా యిదె కోర్కులిత్తుఁ గూరిమికుఱ్ఱా॥ ౬౭॥ క॥ అనితనకమండలంబున। ననిచిన తెలినీరుమీఁద నొకయించుక చల్లిన నెప్పటిమైజిగితోఁ। గనుపట్టి యచటు వెలువడి కడు నర్మిలితోన్॥ ౬౮॥ మ॥ పెనులిబ్బింగనుఁగొన్న పేదపగిదిం బెల్లుబ్బి కేల్మోయి మో।డ్చినిరాబారికడానిబొజ్జగల జేజేమిన్న నగ్గించి యిట్లనియెం గూరిమిమీర నియ్యఁగడలవయ్యా వేడెదన్నిమ్ముఁ జిక్కనిబల్మిన్ దెసయేలు మేలుఁ బెనురొక్కంబుండు బండాలమున్॥ ౬౯॥ చ॥ పనిగసతమ్ము మిమ్ముక నెపమ్మున నెమ్మది నెమ్మి నమ్మినం। గనికరమూని వానిముడికానినినైనను గాతురన్న యుమ్మనుమని నన్నుమిన్నకయ మన్ననఁదిన్నఁజేయుటబ్రమే। యనవుడు నన్ని నీవడిగినట్టు లొసంగితినంచు వెండియున్॥ ౭౦॥ క॥ మెండుపరికించి నేర్పున। దండిమగనివల్లెత్రాడు దాల్పరినిజమున్। గొండల గుండుల ఱెక్కలు। చెండంగల వేల్పుటేనిఁ జేవదలిర్పన్॥ ౭౧॥ క॥ పొడమించి వారివరుసగఁ। బడమరదక్కినము తూర్పు వైపులకున్ము।న్నొడయలనుగాఁగఁ జేసియుఁ। గడమకడనిఁ కెవ్వఁడేలఁ గలఁడనియుండన్॥ ౭౨॥ తే॥గీ॥ తగినవాఁడవు దొరికితి తలఁపనేఁడు। నాదు మదివంతయంతయు నడచెనిపుడు। గట్టువిల్కానితోఁ జెల్మికడలకుండు। పుష్పకంబను తేరిది పుచ్చుకొమ్ము॥ ౭౩॥ చ॥ చలువయు వెట్టయున్ వలయు చందములన్నమమార్చు యుజ్జగం।బులుదిరుగంగ నింగివయిఁ బోవఁగవచ్చును దీని నెక్కియు।క్కొల్లఁదులు తెల్పఁదెల్ప మఱిక్రొత్తలొసంగితి నీకునింక జక్కులు కొలువంగ నీ కొలువుకూటములోఁ గడుఁ బేర్మిఁ గాంచుమా॥ ౭౪॥ వ॥ అనియొసంగి మఱియును॥ క॥ కనికరమునను గనికరమున। మనుమని మనుమని యటుపలుమాఱును దీవిం।చి నలువఱుచ్చనుజనియెం। దనమనికికినొర మంచితనమస పొగడన్॥ ౭౫॥ ఉ॥ అంచపజుమాయిజోడు చనినంతటఁ దండ్రిని జేరఁబోయి లో।నుంచిన కూర్మి మొక్కలిడి యుబ్బుచులిబ్బుల తేఁడు కాంచి దీవించిన తండ్రిఁ జూచి తమరిచ్చిన యానతి నల్వఁగొల్చి మా।పంచిన పెన్పులం బడసివచ్చియు నొక్కటి వేడనూడితిన్॥ ౭౬॥ క॥ పెఱవారెవ్వారలకుం। దఱిఁయుంగాఁదరముకాని తావొక్కటి నే। నెఱినుండుటకున్ వేఁడఁగ। మఱిచితిచోటొందు చూపి మన్నింపఁగదే॥ ౭౭॥ క॥ అన ననుఁగుపట్టి మొగమల్లనఁగని

కడుబుజ్జగించి లలినాతఁడేదం । గనికర మిగురొత్తంగా । వినిపించెద నిలువ నేలవు విను మనిపలికెన్ ॥౯౮॥ తే ॥ గీ ॥ ఉప్పరంబంటుతరగల మొప్పుతోడ । విలువరతనం పుగుంపుల పెంపుతోడ । జడుపెఱుంగని గొప్పమొసళ్ళతోడ । నుప్పునీటిసంద్రము కరంబొప్పనందు ॥౯౯॥ ఉ॥ జాలులయంబుఖండముల చాలగు వేలుపు టేటిదీటునం గ్రాలెడు తావిఁ బ్రోవుల పుట్టు నికస్తురి తావి కైవడిన్ । జేలలలోనఁ జీనివని చీరెలతీరునఁ బూలజాజి పూ । పోలికలంకపొంకమగుఁ బొల్పగు దీవుల మేలు బంతియై ॥౧౦౦॥ సీ॥ వలుకోటకొమ్మల మలచినసింగములే దెసయేనుఁగుల నెల్ల దిగులువరుప । నగరి యుప్పరిగల మగరాల జగడాలు విన్నేటినీటితో వియ్యమంద । వీటనీటుగఁ గ్రాలు వెలిడాలుగమి గాలి వేల్పుజంటలకును వేడ్కలొసఁగ । విరిదోఁట నెత్తావి విన్నంటి వేల్పు ప్రమోదకులకెల్లఁ గొల్లగా వలపు లియ్యఁ । గలికి పగడంపుసోరణగండ్ల శేలుఁ దొలవలవిండున కేగంగఁ ద్రోవ చూప । వీడు తొలివేల్పుగములకై విశ్వకర్మ । లంకయనుపేరఁ జేసె నాలంకయందు ॥౧౦౧॥ క॥ వెన్నునికి వెఱచి పాఱిరి । మున్నటనున్నట్టివారు మొన్ననుని పుడా । సన్నయెఱింగితి గావున । నన్నా నీవేగి యుండు మచ్చట నెమ్మిన్ ॥౧౦౨॥ క॥ క్రిందిజగమ్మున నిలిచిరి । యాపలిరేద్రిమ్మరీండ్లు నచ్చట నీ కే । తొందరయుఁ గలుగ నేరదు । సందడి చూపంగలేరు జంకక పగరున్ ॥౧౦౩॥ చ॥ అని నెలవియ్యనప్పలుకు లాదలఁ దాల్చి కుబేరుఁ డప్పుడే । చనిచని లంకఁ జేరి పలుచందములందను గారవంబుతో । ననయము వేల్పుపిండు గొనియాడఁగ నేలుచునుండి పుష్పకం । బొనరఁగ నెక్కివచ్చి కనుచుండును నిచ్చలుఁ దల్లిదండ్రులన్ ॥ కం॥ అని రారాజు తెఱంగిటు । వినిపింపఁగ రాముఁ డలరి వింతగ మదిఁ దో । చిన నచ్చెరువంది యగ । స్త్యునిఁ గని యిట్లని యె వేడ్క దుడుకొనరింపన్ ॥౧౦౪॥ ఉ॥ ఓ జడదారిరాయ యిపుడల్లము పెల్లుడుకందొడంగెరా । రాజుకుమున్న లంకనుదిరంబుగఁ గైకొని సోకుమూక లెంతేజగి మీఱ నేలునటులీరటు పల్కుటవిన్నసుండి, నే । నీ జగమందు రక్కసుల నెల్లఁ బులస్త్యకులంబు వారిఁగన్ ॥౧౦౫॥ ఉ॥ విందును ముందు, వెండియొక వింతగ రావణుకన్న మున్నులం । కం దగ బెక్కురక్కసులు గ్రాలిరటంటిరి వారి పేళ్లునా । యందటివంగడంబు మహాకటివేల్పునఁ గోడి డాగుటల్ । సందియమూఱఁ దెల్పగదె సాగిలి మ్రొక్కెద నీకునా పుడున్ ॥౧౦౬॥ పంచచామరము॥ అగస్త్యుఁ డంతఁ జెల్వుగ సల్కనంద మొల్కుపల్కులం । బొగడ్తఁ జేసి వాని రాము మోము గోము మీఱఁగా । జగాని గారపోరచూపు జాలు వారఁ జూచి డం । బుగా నెలుంగు కంగు మంచు మ్రోగ వేగ నిట్లనున్ ॥౧౦౭॥ మ॥ తొలుత న్వెన్నని బొడ్డుదమ్మి నెలమిం దాల్చె ల్పుతాఁ బుట్టియ । వ్వలమున్నీరు రోసి రొంచి వానిఁ గొని కాపాడంగ మేదాల్పులం । గలిగింపందరు నాత వారలట నిన్ సంతోస పూరంగమా । వలనంగల్గిన కర్జమేమి వినిపింపం జెల్లునా నాతఁడున్ ॥౧౦౮॥ క॥ మిమ్మిందఱఁ గలిగించితి । నిమ్ములనిన్నీరు ద్రోవ నిప్పుడచనిమీ । నెమ్మది

మమ్ముఁదలంపుచు । నెమ్మోయిఁగా చెదరొ చూతమిందటిబలముల్ ॥౧౦౯॥ క॥ అనివ
నిచినవల్లేయని । వనివినిమున్నీరుగాచు వనిపూనికదూం । గనుకలిగియుండియాకలి ।
గొనిడప్పికి నిలువలేక క్రోలుదమనుచున్ ॥౧౧౦॥ క॥ తలపోసియంతఁబొంతను । న
లుమోములవేల్పుఁగాంచి నక్కుచుఁదమలో । వెలవెలబారుచుమిక్కిలి । యలసియు
నీరానఁగొంకియడఁకువతోఁపన్ ॥౧౧౧॥ క॥ సాకెదమనియొకకొందఱు । మైకొని
రిఁక మెక్కెదమని మఱికొందఱు పె । ల్లాకలికోర్వకపలికిరి । యాకొని నెత్తమ్మిచూ
లి యుల్లంబలరన్ ॥౧౧౨॥ క॥ మెక్కెదమనువారందఱు । జక్కులునుబరాకు
లేక సాకెదమనువా । రక్కజముగసోకుడులును । నిక్కముగానౌదురంచు నెట్టనఁ
బలికెన్ ॥౧౧౩॥ తే॥గీ॥ పెక్కులమ్మాడ్కి జక్కులురక్కసులును । బొడమిపుడ
మిని బొగడికవడసితడరి । వారిలోపలనెంతయు వాసిగనిరి । హేతియుఁబ్రహేతియు
ననంగ నిరువురందు ॥౧౧౪॥ క॥ నెమ్మదిఁబ్రహేతిముద్దుల । గుమ్మలకూటములురోసి
కోర్కులనెల్లం । గ్రమ్మితెగఁగోసిమిక్కిలి । ముమ్మరమగునీసువాని పొలుపుగనుం
డెన్ ॥౧౧౫॥ ఉ॥ రెండవనిబ్బరంపు రెయిద్రిమ్మరి హేఁడల హేతిదండియై । పెండిలి
యయ్యెనొయ్యభయపేరిటి ముద్దులగుమ్మఁగొమ్మఁబూ । చెండులఁబోలు చన్నుఁగవఁ
జెన్నగుదానినినల్వయానతిన్ । వెండియుఁడెందమందు మగబిడ్డలకైగల కూర్మిపేరిమిన్ ॥
౧౧౬॥ క॥ ఆయిరువురకుంబుట్టెను । దీయనివిల్కానితోడ దీటైయనివెన్ ।
దీయనివిద్యుత్కేశుఁడు । సోయగమునకింతులెల్ల సొగయుచునుండన్ ॥ ౧౧౭
॥తే॥గీ తల్లిదండ్రులకన్నులు చల్లఁబడఁగ । విద్దెములుచేసె కొన్నాళ్లువెనుకవెనుక ।
తప్పటడుగులు పెట్టుచు తడవునడచెఁ । బిదపజిలిబిలివలుకులఁ బిలువనేర్చె ॥ ౧౧౮॥
తే॥ గీ॥ అట్లుముద్దులుగురియుచు నలరఁజిన్ని । తనముమెల్లనజాఱె జవ్వనముమొ
లిచెఁ । జిన్నిపాయంపుమేనికి వన్నెయొసఁగి । కుందనంబును నెత్తావిపొందినట్లు ॥
౧౧౯॥ తే॥ గీ॥ వెడఁదఱొమ్మున కొకవింతవీఁకయొదవె । నగుమొగంబునకొక వింత
జిగిదొలంకె । మీసకట్టునకొకవింత మిసిమితోచె । హేతిపట్టికి జవ్వనమింపుమెఱయ ॥
౧౨౦॥ క॥ అప్పగిదిముద్దుకొమరుని । యొప్పునకుందగినయట్టి యొయ్యారిని దాఁ ।
దప్పకపెండిలిసేయఁగ । నప్పుడుతలపోసిహేతి యందఱుమెచ్చన్ ॥ ౧౨౧॥ సీ॥ కవ
జక్కవలఁబోలి తావపెక్కువలనేలి చన్నులుకన్నులు చెన్నుమీర । జిగిమెఱున్నవలె
మించి తగమిన్నుఁదులకించి మేనునుగొనను జానుమీర । నిరులసొంపునుమీరి తరగసొం
పునుదూరి కురులునుదరులును గొమరుమీర । నరటాకుఁగనినవ్వి మరుబాకులనురువ్వి
వీపునుజూపును వింతమీరఁ । జిలుకపలుకులుఁ జెలువంబు గులుకుచెవులుఁ । దళుకు
తొడలను నొయ్యారముఁలుకునడలు । మొలకనగవును జిగిమోవి గలిగియలరు । వెలఁది
సంధ్యకూఁతునుదెచ్చి పెండ్లిచేసె ॥౧౨౨॥ శా॥ ఆవాల్గంటియు మున్నువిన్నసిగదయ్యం
బున్మదిన్నెయ్యముల్ । దైవారన్ వినువాక పెండ్లియగు చందానందగంబెండ్లియై । వే

వేగం దొలిచూలు బాల్యకొమరున్ వేఱొండు చోఁ గాంచి యా। క్రేవం గవ్వపుఁగొండ దండనిడి యేగెం బెన్మిటింగూడఁగన్ ॥ ౧౨౩॥ తే॥ గీ॥ తెగుదురెంతటి పనికైన నఁ దగవుఁదలఁప। రించుక యుబొంకఁ గొంకరు మంచివానిఁ। దలఁపువడిరేని యేమైనఁ గలయఁ జూతు। రహహ యెంతటి జెంత లియ్యాదువారు॥ ౧౨౪॥ క॥ పసిపాపఁ డేడ్వఁ జొచ్చెను। దెసలెల్లను మాఱుమ్రోయ దిగ్గన మెకముల్। వెసనులికిలేచి వెఱపున। మసలక నలుదెసలఁ బాఱ మఱిమఱియు చటన్॥ ౧౨౫॥ వ॥ అప్పుడు॥ సీ॥ మొనలకైదువుతోడ మురిపెంపు టిరిగుంపు మఱపింపు కుత్తుక యొఱపుతోడ। తలవాకజిగితోడ తెలిమబ్బు వెలిద్రొబ్బు తెలిగబ్బతత్తడి పొలుపుతోడ। పాపపేరులతోడఁ బగడాల జగడాలు నగఁజాలు జడల సోయగముతోడ। పునుకపళ్ళెముతోడ మినుముట్టఁ గనుపట్టు పెనుగట్టువింటి యొప్పిదముతోడ। చిన్నిక్రొన్నెల వన్నెల చెన్నుతోడఁ। బేసికన్నుల చిన్నెల వానితోడ। గట్టుదొరపట్టితోఁ గూడి గట్టువిల్తుఁ। డపుడు తఱిగట్టుదరికి వయ్యాళి వెడలె॥ ౧౨౬॥ తే॥ గీ॥ మింటవిచ్చేసి యబ్బేసికంటివేల్పు। చెంతనుకవింత రొదయింత చెవులుసోక। నిలిచియాలించి గాలించి నిసువునొకని। మ్రోలఁ దిలకించి పరికించి జాలిగాంచి॥ ౧౨౭॥ మ॥ కదియంబోవుచునున్నవేళ ఫలరా గారాబపుంబట్టి పయ్యెద కొంగించుక యోరజారవలచే నిట్టట్టు గానొత్తుచున్। మదిలో నక్కటికంబు పిక్కటిలఁ గానవ్వచ్చి యా బిడ్డయం। గదమోన్పం దగునంచుఁ బల్కుటయు నాక్రొల్గంటిపైఁ గూరిమిన్ ॥ ౧౨౮॥ క॥ జవరాలి జాలిమాటలు। జవదాఁటక చావులేక చనుబ్రతుకుదెసల్। బవరముల గెల్చు బలిమియు। దివిఁ ద్రిమ్మరు వీడుఁ దల్లిదినుసగు నీకున్॥ ౧౨౯॥ తే॥ గీ॥ ఒసఁగి యేను మోముల సామి యారకున్నఁ। గాంచి రాణియు నైన లేనికనికరమున। జవ్వనంబును బీరంబుఁ జక్కదనముఁ। గలిగియప్పుడ యొప్పఁగఁ గారవించె॥ ౧౩౦॥ క॥ దేవరయును దేవేరియుఁ। గావలసిన కోర్కులెల్ల గారాబముతో। దీవించి వేడలేఁడని। వేవేగనొసంగ బిడ్డ వేడుకఁ జెందెన్॥ ౧౩౧॥ గీ॥ అడవిఁ గనిపాఱవైచిన నైనఁ బ్రతుకుఁ। దల్లికడుపుచల్ల యొకింతతగ్గదేని। యింట బంగరుతొట్లలో నిడిననైనఁ। జచ్చుఁ దల్లికడుపుచల్ల చాలదేని॥ ౧౩౨॥ గీ॥ అట్లు పసిపాపయప్పుడె యుబ్బురముగ। నిండు పరువంబుఁ గైకొని నిలిచి కెలనఁ। బూపనెలదాల్పుఁ గనికూర్మిఁ మ్రొక్కి యతని। చెలువకు జొహారులొనరించి చేరికొలిచి॥ ౧౩౩॥ ఉ॥ వారలయానతిన్మిగుల వన్నెయు వాసియుఁ గాంచి వారిఁ గై। వారముచేసి వీడుకొని వారొనరించి యొసంగినట్టి యా। యారను రక్కసుండు గడునుక్కునఁ గాపురముండి తద్దయున్। బీరముతో సుకేశుఁడను పేరను గారవమందె నందులన్॥ ౧౩౪॥ క॥ ఆతనిసోయగముం గని। చేతులగరువంబుఁ జూచి సొలఁగుచునిటకున్। లేతఁగ గ్రామణియను వేల్పేతెంచి సుకేశుఁ గాంచి యొంటయు వేడ్కన్॥ ౧౩౫॥ సీ॥ అందంపునును జెక్కు లద్దంపు మించులు మించులు నిద్దంపు మేనిజిగులు। కాటుకకన్నెరుల్ తేటిముత్తమ్ములు తమ్ములు తెలివాలు తళుకుగనులు। నిం

డైనచిఱుకప్పు పంచుచు వెన్నెలనిగ్గు నెలనిగ్గు చక్కని నెమ్మొగంబు । వన్నెబంగరుగిండ్లు వలిగబ్బిగుబ్బలు గుబ్బలుల్ పిఱుఁదుల గొనబుహొయలు । చెప్పనొప్పనె యప్పాత్తి యొప్పిదంబు । నట్టితనకూఁతుఁ జిన్నిపాయంపుదాని । నందములకెల్ల నందమైయలరుదాని । దేవవతినాఁగఁజనుదానిఁ దెచ్చియిచ్చె ॥ ౧౩౬ ॥ క ॥ అరమరలులేని కూర్మిలఁ । గరమరుదుగఁ గలసిమెలసి కలికియుమగఁడున్ । సిరివిరిబోడిని వెన్నునిఁ । బురుడింపుచు మరునికయ్యమునఁ బెనఁగొనుచున్ ॥ ౧౩౭ ॥ గీ ॥ కొన్నియేడులు పోడిమినున్నపిదప । మాల్యవంతుఁడును సుమాలిమాలియనఁగ । ముప్పురవ్వారిబోడికిఁ బుట్టిరెలమి ॥ ౧౩౮ ॥ క ॥ ఆయుష్పురుఁదండ్రివలెం । దామును బెనుమెప్పులందఁ దబుసొనరింపం । గా మదిఁ దలఁచి యిలువెడలి । యామునగవినీమంచు కొండయండకుఁగడిమిన్ ॥ ౧౩౯ ॥ చ ॥ చనిదటమూరఁ జెట్లనునుజాయల డాయకబట్టబైల నైక్కొనువడగాలిఁ గ్రోలి మదిఁ గొంకకజంకక యొంటికాలునం । బనుపడ నిల్చిపొల్చి నలువందను యందవుదెందమందు వేడ్కను దలపోయచుం దబుసుగానిలిచేసిరి వారుముప్పురున్ ॥ ౧౪౦ ॥ క ॥ జగములనుదబుసువేడిమిఁ । బొగలెగసెను మింటుమంట మొత్తముపర్వెన్ । వగలంబొగిలిరి వేల్పులు । బెగడొందెను జాలవేల్పు పెద్దయుమదిలోన్ ॥ ౧౪౧ ॥ ఉ ॥ దానికిఁదాళఁజాలక వెతందెఱగంటులు దద్దరిల్లి లోఁనూనిన నివ్వెఱంగదలి యాడనిజాడిరి తమ్మిచూలికిం । బానలుదీర రక్కసుల బ్రల్లదనంబులు విన్నవింపఁగాఁ । బూనికడెంక డోఁప నటమున్నె యతండును నందువేడుకన్ ॥ ౧౪౨ ॥ ఉ ॥ అంచపుమాయినెక్కి తెలియందపుటెక్కల డాలునల్గడల్ । ముంచుకొనంగఁ గెంపుజిగిముక్కు మొఱుంగులు చౌకళించి పోల్గాంచిన జాళువాబొమిడికంబుల డంబగు మానికంపు గ్రొమ్మించుల తోడమాల్మలయు మింటనువచ్చెను వారిపజ్జకున్ ॥ ౧౪౩ ॥ క ॥ విచ్చేసి వారిమేనులు । మచ్చికతోఁ గేలనిమిరి మదితాల్మికి లోఁ । నచ్చెరువందుచు దీవెన । లిచ్చి కనికరంబు దోఁప నిట్లనిపలికెన్ ॥ ౧౪౪ ॥ ఉ ॥ రక్కసులార చేరువకు రండిదెవచ్చితి మిమ్ముఁ జేరఁగా । నిక్కరణిన్నెతల్ గుడువ నేటికిమీకిఁక లెందుతాల్మికి । న్నిక్కముగాఁగడెందమున నేఁగడు మెచ్చితి మీపయిం గరం । బక్కటికంబుపుట్టె నిపుడాసనికోరుఁడు కోర్కులిచ్చెదన్ ॥ ౧౪౫ ॥ క ॥ అనిపలుకుల వెలఁదుక చ్చక్కనిమేలిమియం దెరవళిఁ గైకొనని యొలుం । గునఁ దొలివేల్పానతియిచ్చిన విని వడిలేచివచ్చి చిడిముడితోడన్ ॥ ౧౪౬ ॥ చ ॥ అలవలకేల నల్వమొఱలంటిన వెంటనె యట్టెతొంటి యా । యలనటువాని వాని గని యా రెయిబ్రిమ్మరు లొక్కయమ్మడిం । బలుకులఁ దేనియల్ దొలుకఁబారఁగఁ గేల్గవదోయిలించి యిచ్చలఁ దొలివేలుపుం బొగడఁ జాగిరికన్నులువిచ్చి యచ్చటన్ ॥ ౧౪౭ ॥ క ॥ జగములఁ బుట్టింపఁ బెంచి । నెగడింపను గినుకఁ బాని నీఱ్ఱంపను పేలు గదగునెఱపోసవు నీ వెగచా నెత్తమ్మిచూలి వేలుపుపెద్దా ॥ ౧౪౮ ॥ క ॥ జతలేనినీకులఁ దగిసి । మతకముతెలిపంగలేక మైదాల్పులొడల్ । సతమనినమ్మి కరమ్మున । వెతలం

బడి పొరలుచుండ్రు వెఱ్ఱులవగిది౯॥ ౧౪౯॥ శా॥ ఎందున్మీసరిపోల్పఁగాఁదగిన వేల్పెన్నంగ నుండఁడొక్కఁడీ। యందంబైన జగంబులోపలఁ గలండా పేర్కొనన్నెమ్మిమి। మ్ముందోరంబుగనమ్మి వేడుకొనుటల్ ముంగొంగుబంగారుగా। ముందున్నిండుము నేఁడుమాకది నిజంబుంజేసితివియ్యెడ౯॥ ౧౫౦॥ క॥ మాపైఁగనికరమొలయఁగ। మాపూన్కికిమెచ్చి మమ్మమన్నింపంగా। నోపెదవే నిన్వేడెద। మాపయిమాపేలును దమ యక్కటికంబు౯॥ ౧౫౧॥ కడదారలను బవరంబుల। నొడువంగల బల్మిమాకు నొండొరులవయి౯। విడువనికూర్మియు సిరులును। నెడపకవేలుపులవేల్ప యిప్పింపఁగదే॥ ౧౫౨॥ గీ॥ అనుచుఁగొనియాడి తనవేడఁ గనికరమునఁ। గోరికలనిచ్చి చలిమెచ్చి కూర్మిఁపేర్మిఁ। దడవు దీవించి మించి నెత్తమ్మిచూలి। కదలి వినుదారిఁ దనవారిఁ గలసి చనియె॥ ౧౫౩॥ వ॥ అంత॥ ఉ॥ వేలుపుఁబెద్ద తానిడిన విప్పగుమెప్పుల నొప్పమీరి తా। ల్వేలుపుఁబెద్దలొక్క మొగివిక్కుచు నిక్కుచుఁ గండక్రొవ్వున౯। వేలుపుఁ బెద్దలంగెలిచి వీరినివారిని బోలివారల౯। గేలిమొనర్చి పేర్చి పెనుకిన్కమెయిం జెఱఁబెట్టిరింతుల౯॥ ౧౫౪॥ క॥ పొడిచిరి పెక్కుర జక్కులఁ। జడదారులఁగాళ్ళరాచి చమిరిరినేల౯। గడతేర్చిరిచిలువలనొక। కడకుందెచ్చిపొగరెచ్చి కలఁచిరిజగముల్॥ ౧౫౫॥ గీ॥ వారుపెట్టెడి రట్టడిఁ బడఁగలేక। యిండ్లువాకిండ్లు విడనాడి యెదలనోడి। కన్నకన్నవారల నెల్లఁగాళ్లపట్టి। పట్టియనదలై వేల్పులుకట్టువడిరి॥ ౧౫౬॥ సీ॥ ఒకవాడ మొకమోడ కొకవేల్పుఁగొట్టింతు రొకవంకజముఁలెంక నొడిసిచఱతు। రొకచక్కి పొగరెక్కి యొడయండ్లఁబట్టింతు రొకచాయఁదొగదాయ నొడుగనడతు। రొక దారి జడదారి నొఱపులఁబెట్టింతు రొకచెంత నెలనిగ్గ యుక్కడంతు। రొకమేల వినుచూలి నూరకకట్టింతురొకదండజమునుండ నోలిఁబంతు। రొక్కయిక్కనుజక్కుల యుబ్బడంతు। రొక్కగీమునఁబాముల నుక్కుమిగులఁ। బెక్కులాగుల నేగులఁ బెట్టుచుండ్రు। రక్కసులు ముప్పురును గ్రొవ్వుపిక్కటిలఁగ॥ ౧౫౭॥ సీ॥ నీళ్లమోవఁగలోగె నెఱిమాలి నెలదాల్పు కనుమాయటుడిగె వేగనులవేల్పు। బిచ్చకానిని జేరె వచ్చిజక్కులఱేఁడు పిచ్చుకుంటైపోయె బెగడిజముఁడు। రేలుద్రిమ్మరుచుండెఁ దూలిరక్కసుఁడెప్డు ఇంటయిండ్లనడంగె వచ్చిచిచ్చు। వంకలకిరవయ్యె వలగొని నీటిఱేఁడొకమూలఁబడియుండె నొకఁడుగాలి। తక్కుగలవేల్పులెల్లను దల్లడమున। బయలువట్టి తిరుగునట్టి బ్రతుకుగనుటె। కాకనోరికొరెమొకింతలేకమనిరి। యకటచెప్పెడిదేమియాయాగడంబు॥ ౧౫౮॥ క॥ ఇక్కరణి మ్మువ్వురు నా। రక్కసులుం గండకావరంబుననేరి౯। లెక్కయొనర్పకయుండిరి। యెక్కుడఁగనుఁగొన్న దమరెయగుచుఁగడిమి౯॥ ౧౫౯॥ తే॥గీ॥ అంతనొకనాఁడు వేడుకలనఁగిపెనఁగఁ। బెద్దకాలు [illegible]ండి ముప్పురుఁబెంపెసంగ। వేల్పటగసాలిఁబిలిపించి వెఱపుమీర। వలయుమరియావలోనరించిచ్చానికనిరి॥ ౧౬౦॥ క॥ ఓయీవేల్పులకంపఱ। కాయాకోలఁదుల నెఱిం

గి యందపు నెలవుల్ । సేయుటవలనను నీపే । రేయెడలను వన్నెకెక్కె నింతయు
నలఘా ॥ ౧౬౧॥ ఉ॥ కావునమాకునుం బసిఁడిగట్టునసైనను వెండికొండపై । నావ
లనైనమంచుమలనైనను గవ్వఁపుఁగొండనైననున్ । నీవెరవంతయున్నెఱపి నిక్కపుఁజి
క్కనిమానికంబులన్ । తీవియెలర్పఁగూర్చి యిపుడేయొడగూర్పుము పైడిమేడలన్ ॥
౧౬౨॥ క॥ అనినన్ జేతులుమోడిచి । యనువొప్పఁగవారిమోములందునెచూడ్కుల్ ।
పెనచియడంకువతోనిటు । పనితెఱఁగెఱిఁగించె నతఁడువారలతోడన్ ॥ ౧౬౩॥
తే॥ గీ॥ జలధికడయందుఁ బొలుపొందు సంభ్రమందు । నెసఁగు నొకదీవి పెనుదీవి
యెల్లమెరసి । పుడమియందున నెందునుబుట్టరాని । మానికమ్ములనిద్దుల మలచితెచ్చి॥
౧౬౪॥ ఉ॥ వేలుపుఱేనియానతిని వింతగఁజేసితి వీడొకందు తా । ల్వేలుపులార
యున్నగడువేడ్కఁద్రికూటముఁనాగఁబేరునం । గ్రాలెడుకొండకొమ్మునను నాతెలివె
ల్లను వెల్లడింపఁగా । నేలినవారికయ్యదియె యిమ్ముగునిమ్మని నాకుఁదోఁచెడున్ ॥
౧౬౫॥ సీ॥ ఏవీటికిని నాల్గుక్రేవలందునుజుట్టి సంభ్రమగడ్తయై చవులునింపు । నేయూ
రి పెనుకోటఁ బాయకబురుజుల నేపునవేల్పులుకావుగాతు । రేప్రోలవరువాత నెల్ల
రనిద్దుర మిన్నేటియలుకుడు మేలుకొలుపు । నెందలిరతనాలు చిందిపడఁగడలితావ
లంబయ్యె రతనములకును । ఎచటి యెలదోట గమితావియెసఁగిమింట । వేల్పుటాండ్ర
కు మగలకువేడ్కలొసఁగు । నెచటిపయ్యెరలడతేరియెల్లయపుడు । చెఱుకువిలుకాని
కయ్యంపుఁజెమటలార్చు॥ ౧౬౬॥ వ॥ అట్టిసింగారంబులకుం బుట్టినిల్లును గలుముల
కాటపట్టును బీదసాదలకుం బసిండికొటారును బెద్దలకుం బట్టుగొమ్మయునయి చెన్న
లరుచున్న॥ ౧౬౭॥ ఉ॥ లంకనుజేరిమార్తురనలంతులఁ బాఱఁగఁదోలి నెయ్యురం ।
బొంకముగాఁగఁ గల్మిలిడిప్రోచుచు మీసరిసాటివారిలో । నంకిలిలేనిగొప్పఁ గనఁ జేసఁ
గలారని వేల్పువద్రవాఁ । డింకను గొన్నిపల్కె లెదకింపుగ మంతనమందుఁబల్కెనన్ ॥
౧౬౮॥ ఉ॥ సంతసమందిముందఱను సామిహసాదని పెద్దయెల్గునన్ । వింతగఁబల్కె
చుం బసిఁడి బెత్తములెత్తి యదల్చిమూఁకనం । తంతఁదొలంగఁదోలి వఱిహారులు సూ
రెల ఢాకొచేయఁగాఁ । జెంతలఁజేరియొండొరులఁ జీరుచుదండులు వెంబడింపఁగన్ ॥
౧౬౯॥



ఇంతవఱకు ౧౮౭౬ వ సంవత్సరపు పురుషార్థప్రదాయినిలోఁ బ్రకటింపఁబడి యున్నది.—కం-వీరేశలింగము.



తే॥ గీ॥ కదలిపోలదిండ్లయార్పు లాకసముముట్ట । లంకఁజేరిరి ముగురుఁ గలంకదేరి।
యంత వారలబీరంబు నలవు బలిమి । యరసి నర్మదయానైన నచ్చరనైలంత॥ ౧౭౦॥
క॥ పువ్వులుతునివాలారుం । గ్రొవ్విరితూపులాయనంగఁ గొమరారెదు లే।జవ్వనులం
దనకూఁతుల। ముప్పురఁగొనివచ్చియిచ్చె ముగురికినెలమిన్॥ ౧౭౧॥ వ॥ అందు మాల్య
వంతుండు సుందరియను తనవెలందియందు వజ్రముష్టియు విరూపాక్షుండును దుర్ము
ఖుండును సుప్తఘ్నుండును యజ్ఞకోపుండును నున్మత్తుండును మత్తకుండును నను
నేడుగురు కొడుకులను నిలయను కూఁతునుం గనియె సుమాలికిఁ గేతుమతియను
ప్రోయాలియందుఁ బ్రహస్తుండును నకంపనుండును వికటుండును శకటముఖుండును
ధూమ్రాక్షుండును దండుండును సుపార్శ్వుండును సంహ్రాదియుఁ బ్రఘసుండును
భాసకర్ణుండును నను పదుగురు కొడుకులును బకయుఁ బుష్పోత్కటయుఁ గైకసియుఁ
గుంభీనసయు నను నలువురు కూఁతులునుం గలిగిరి మాలి వసుధయను దన వాల్గంటి
యంద నలుండును నీలుండును హరుండును సంపాతియు నను నలుగురు కొమాళ్ళం
గాంచె వారె విభీషణునకుం బ్రగ్గడలై వెగ్గలంపు టగ్గలికలఁ జెన్నమీఱిరి॥ ౧౭౨॥
తే॥ గీ॥ ఇట్లు తామరతంపరై యేపుఁజెంది । జగములందెందు నెవ్వారి సరకుగొనక।
విఱ్ఱవీఁగుచుఁగొడుకులవెంటఁగొనుచు। ముజ్జగంబులుఁగలఁచిరాపొలసుదిండ్లు॥ ౧౭౩
ఉ॥ వారల రాయిడిన్సొగిలి వాంఛితవెల్లని మోముదమ్ములం । గూరిన నెవ్వగం గదలి
కోరికలీరికలెత్త వేల్పులె।వ్వారలఁజేరువారమిఁక వాసిగనుండఁగ నెద్దితావిఁ కె।వ్వా
రికి విన్నవింపుదము వారలయాజడియంచు నెంచుచున్॥ ౧౭౪॥ క॥ ఆరసి కర్జముఁ
గని యి।బ్బారిని నలమలవిలుగలవాఁడడఁపంగా। నేరుచునని పొంగివడిం । జేరి రొకట
వెండికొండ చెంగటికెలమిన్ ॥ ౧౭౫॥ చ॥ అటువలె వెండికొండఁ దఱియంజని
మేలిమిగద్దెమీఁద న।చ్చోటఁ గొలువుండి వేడుకలఁ జొక్కెడుమిక్కిలి కంటిదేవరం।
బోటుపాటఁ గన్నులందొరిగి ముమ్మరమై చను నీటిజాలుతో । నటమటుమాఱఁగాంచి
మదినక్కుచు నెయ్యమునం బెనంగొనన్॥ ౧౭౬॥ తే॥ గీ॥ ఒదుగువాటున నిలుచుండి
మొక్కబెట్టఁ । జేతులుమొగిడ్చి జోహారుచేసినిలిచి । వేల్పుటేఁడుము మున్నుగా వేల్పు
లెల్ల । నెలుఁగుకుత్తుకఁ దగులంగ నిట్టులనిరి॥ ౧౭౭॥ తే॥ గీ॥ ఏనుమోములవేలుపా
యిదెజోహారు । ఇవముగుబ్బలియల్లుఁడ యిదెజోహారు । ఇంచువిలుతాని పగవాఁడ
యిదెజోహారు। ఎక్కుడుకనులదేవర యిదెజోహారు॥ ౧౭౮॥ చ॥ ఉడుగని కిన్క
తోఁ గదలి యొక్కటనెక్కడఁ గన్నదామమై। కడఁక సుకేశుబిడ్డలు జగంబులనేవఁగఁ
దల్లడిల్లి యి।య్యెడలను ముజ్జగంబులను నేలెడు దేవరవీవటంచు నీ।యడుగులు పట్టి
వచ్చితిమి యారసి మాముఱలాలకింపవే॥ ౧౭౯॥ క॥ కాల్చిరిజన్నపుసాలలు। కూల్చిరి
దేవళములెల్ల గోడలతోడన్। బీల్చిరి మాసనినెత్తురు । రాల్చిరి యేలికలతలలు రవణం
బులతోన్ ॥ ౧౮౦॥ ఉ॥ ఏమనిచెప్పవారమల యారసమప్పోలదిండ్లబారిచే। నేము

ము బోవఁగా వెఱతు మెవ్వడు జన్నపుఁబాళ్లు గైకొనం । దానును గుట్టుమీఱి జడదా
రులు మానిరి ముక్కుపట్టఁగన్ । బ్రేముడి బొట్టియల్ విడిచిపెట్టిరి యొజ్జలు నూరకు
చూడఁగన్॥ ౧౮౧॥ క॥ మేమే జేజేదొరలము । మేమే జగములను నెల్ల మిన్నలమను
చున్ । బాములిడం దొరఁకొని రాబాగులు కడతేర్చి మమ్ము బ్రతికింపఁగదే॥ ౧౮౨॥
క॥ అని మొక్కి తన్ను వేడిన । మునిసిగరాయుండు వారి విన్నప మెల్లన్ । విని కనికర
మెదఁబొదలఁగఁ । గనుఁగొనలం బిన్ననవ్వు గదురఁగఁ బలికెన్॥ ౧౮౩॥ క॥ మీ యుం
డఱ నిజమాడెద । మోమోటలు కట్టిపెట్టి ముఱికులవారున్ । నేమడఁపను నోపవెన్నని
నేమంబునఁ గానఁబొందుఁ జేకుఱుఁ గోర్కుల్॥ ౧౮౪॥ క॥ వెన్నుఁడు దక్కఁగ
నొండొకఁ డెన్నఁడుఁ గెడపంగఁ జాలఁ డీరక్కసులం । దిన్నగ మీరిపుడాతం దున్నెడ
కరుగుండు నెమ్మియుల్లముగ డురన్॥ ౧౮౫॥ క॥ ఆకైవడి మలవిలుతుఁడు । మూఁ
కగఁదను వేను వేలుపులతోననఁగా । నేకడఁ గొలిచెడి వారలఁ । జేకొని కాపాడ మీఁకె
చెల్లునటంచున్॥ ౧౮౬॥ క॥ ముక్కంటిసీడొక్కి వా రొక్కట వెలికొండ వెడలి
యొండొరుఁగనుచున్ । మిక్కిలి పొంగి చెలంగెడి । యక్కజపు పాల్కడలిఁ గాంచి యం
తోకదిసిన్॥ ౧౮౭॥ క॥ కడలికిఁ దొడవవఁగాఁ గడు । బెడగగు నొకవీడు చూచి
సొంపుగ దానిన్ । దడవబ్బురపడి చూచుచు । నెడనెడఁగల వింతలెల్ల నేర్పడఁ దమలోన్॥
౧౮౮॥ గీ॥ చెప్పి మెచ్చుచు నుక్కింత సేపు మసలి । మొక్కచక్కని జక్కని చక్క
దంపుఁ । బనులఁ జెలువొందు పొగడొందు పసిఁడికోటఁ । గనుల విందుగఁ బొడగాంచి కనఁ
బలంచి॥ ౧౮౯॥ గీ॥ చొచ్చి యచ్చంపు బచ్చల హెచ్చుహెచ్చు । కట్టడపుఁ ద్రోవ
త్రేవల బిట్టు నడిచి । యవల మగఱాల జిగిచాల యలమనలరు । తళుకులీనెడు వెన్నుని
నెలవు చేరి॥ ౧౯౦॥ సీ॥ పొంగారు బంగారు రంగు కంబంబులఁ జలువ చప్పరములు
చెలువు నింప । సరిమించు సిరి గాంచు సరిగంచు నందంపుఁ జందువా మిసమిసల్ చౌక
ళింప । వగఁ గ్రాలు పగడాల మొగరాల గుంపుల కెంపుల త్రేవలఁ గ్రేళ్లు దాట । మెఱుఁ
గు నిదారలేని నెఱ మానికపుఁ బెద్దగద్దెల నిగ్గులు గంతుమిగుల । వెన్నుఁ బొడగను గడ
కను వేడు కాతి । నిలువఁదీఱక యూరక నెట్టుకొనుచు । వెంటఁ దనవారిఁ గొని పాఱు వేల్పు
ఱేఁడు । వేయి కన్నులు చాలక వెఱఁగు చెందె॥ ౧౯౧॥ చ॥ జిగి మగఱాల నేలవయిఁ
జెట్టులుఁ బిట్టెలుఁదీర్చి కూర్చి సొంపుగ నమరించినట్టి మను వుత్తడి కంబపు గుంపు మీఁది
పెన్ । బగడపు దూలపుం గములపైఁ దెలిముత్తెపుఁ బాలగచ్చుతో । నిగనిగలాడఁ బోడిమిని
నెట్టనఁ గట్టిన మేడలోపలన్॥ ౧౯౨॥ క॥ వెన్నుండుండుట వినిచని । క్రన్ననఁ జూడఁ
దలఁచియా ను కాఁడోయని యం । తన్నిలిచి మొక్కకలికిని । విన్నవ మొనరింపుమనుచు
వేడిరి వేల్పుల్॥ ౧౯౩॥ వ॥ అదియునుం జని॥ ౧౯౪॥ సీ॥ మొనవఁటఁ గొనయంటి
కానుమంచులచ్చికిఁ దెలియఁగుమడుపులందిచ్చువాని । సిరిగంధము దెచ్చిదెచ్చి చేరమ్మని
నేలగుబ్బెత చెక్కిలి కొట్టువాని । తనుఁజూచి తత్తవేచి చమవొన్వఁ గమగీటు సీళతోఁ

జిఱునవ్వు నెఱపువాని । నెవరందొ ముప్పురంబు హెచ్చు కూరిమినాకుఁ జెప్పుకొండని నవ్వి చెలఁగువానిఁ। బచ్చివలపుగ ముచ్చటల్ పలుకువాని । వెన్నఁగని ప్రొక్కి వాకిట వేల్పులెల్ల। సామి నిలుచున్నవారని చనువు కతన। మనవి చేసిన రమ్మని మనుచు బలికె॥
౧౯౫॥ క॥ అగుదెమ్మని నెలవిచ్చిన । నరిగి సరగను బణిహారు లా వేల్పులతో । దొర వారిటు మిము దోడ్కొని । యరుదేరఁగ మమ్ము బుచ్చె రమ్మంచు దెలుపన్॥ ౧౯౬॥
గీ॥ వారలందఱుఁ జనుదెంచి వగుసతోడ । వెన్నునకుఁ బెక్కు తెఱంగుల వేఱువేఱ। మ్రొక్కులిడి పొగడ్తలు దెసల్ మ్రోయఁజేసి। విన్నవించిరి తమపడ్డవెతలనెల్ల॥౧౯౭॥
చ॥ పొగరున రక్కసీంద్రుడు తగమా పురుఁ బ్రోవుగఁ గూర్చి దాచినాఁ। జగములు గాసిచేసె దరు చావక మానెను మేనుపూనుటన్ । మిగుల గ్రంతల నెగ్గిలి మీకడకిట్లు దేరగల్గెమా। మొగులడఁగించి ప్రోవఁగదవే యిదె వేడెద మెల్లవారమున్॥ ౧౯౮॥ సీ॥ నెఱ మగంటి మిమ్మాని నీళ్ల మోవఁగలోగి వెలినైన మలవిల్లు బలిమియెంత । మాఱువేసము పూని మఱిసీయఁదూరిన పచ్చదుప్పటివాని బలిమియెంత। ముదిమది వోయి ప్రాఁజదువులు గోల్పడి తలకొట్టుబడు తాతబలిమియెంత । గొడవలుపడి కోడికూతకూసి యెట్టి యల వేల్పురాయని బలిమియెంత । నిదుర యన్నది యెన్నఁడు వదలిపోగు । లాతె తెఱగంటి దంటల చేత బలిమి । యెంచనది యెంత మాకిని యెంచునైన । లెక్కసేయరు మాటలు పెక్కులేల॥ ౧౯౯॥ గీ॥ ఏమి చెప్పకొనుదు ముమా సామి నీకు। వారు పఱచెను నెఱపుల వనరునప్పు। డెంతో దోసంబు చేయువా రిట్టి వేల్పు। బ్రతుకు జెందాదురని యెంతు పెదల లోన॥ ౨౦౦॥ గీ॥ ఇచ్చమాని సులను జూడమిచ్చుటగును। జావుగలిగినవారల చందమరని। యేలొకో తా ముగలిగింపఁ జాలఁడయ్యెఁ । జావుమాకని నలువపై నేఁ వాడము॥
౨౦౧॥ సీ॥ బెకిసంబు గాఁగేల నడిదంబు పూనిన మేటి రక్కసులకుఁ జేటుమాను। బిగివింటి నొగినంటి తెగనిండ దీసిన బిరుదు దండుల కేంద్రు వేయునింతుఁ। బులుఁగుతత్తడి నెక్కి పాలికలసికి నేగ నొవ్వని వారల యసురులేగు । నెదలోనఁగనలూని యించుక చూచినఁగాని వారల పిండుగండడంగు । బటువు కైదువు తనరారదిటను మీఱ । బంటులను గాచు పనిపూని వచ్చితేని । తలఁకకెవ్వాఁడు చివ్వకు నిలుచువాఁడు। జాలమేలను సైకొమ్ము సరగమమ్ము॥ ౨౦౨॥ క॥ అని విన్నఁదనముతోపఁగ। మనవి యొనర్పంగవారి మన్ననతోడం। గనుఁగొని వెన్నుండిట్లని। కనికరమున నానతిచ్చెఁ గరఁగిన మదితోన్॥
౨౦౩॥ చ॥ ఎఱుఁగుదు రక్కసీండ్లు వయిచ్చిన పొవ్వల నొవ్వ మీఱి పన్ । తెఱఁగుల మిమ్ము నొంచుటయుఁ దీఱని యాఱడి కోర్వలేక యం।దఱు మలవిల్తుఁ గొల్చుటయు నన్ననాతఁడు మిమ్ముఁబుచ్చుటే। నెఱుఁగుదు వేల్పులార చనుఁడిండ్లకు వారల రూపుమాపెదన్॥ ౨౦౪॥ క॥ అమ్ముల వానలు గురియుచు । నెమ్ములు విఱుగంగ మొత్తి యొవరడ్డయినన్। నమ్ముఁడు జముకడకనిచెద। నిమ్ముల నుండుండు మీరలెల్లరు నింకన్॥ ౨౦౫॥
గీ॥ అట్టికరమును గనికరముట్టిపడెడు । వెన్ను పలుకులు వీనులవిందుగొలుప । నెదలఁ

జాదలెడు సుదిలల వదలికదలి। యిమ్ములకు నేగి రిమ్ముల నెల్లవారు॥ ౨౦౬॥ గీ॥ అట్లు
జేజేలు తమయిండ్ల కరిగినంత । నంతయును వేగరుద్దెల్ప నాలకించి మాల్యవంతుఁడు
తమ్ములమంతనమున౯। బిలువఁగానంపి యొరులకుఁ దెలియకుండ॥ ౨౦౭॥ గీ॥ తగవు
దోపంగ నిట్లనెఁ దమ్ములార। వినరుగా నేటిప్రొద్దొక వింతవింటి। వెఱచి మొన్న నీనదుమ
ను వేల్పులేమొ। గట్టువిల్కాని యొద్దకు నట్టెయేగి॥ ౨౦౮॥ క॥ కనివేనవేల తెఱఁగులఁ।
గనికరమెదఁ బుట్ట నోటికనితీఱంగా। మనయాగడంబులెల్లను। మనవియొనర్చుచు నటు
వయి మమువిూబంట్లక౯॥ ౨౦౯॥ క॥ నిలువంగనీయరెంచును । బలియురు రక్కసు
లు వారివారికి మమ్ముం। దొలఁగించి యేలకుండినఁ। గలరేయెందైన మాకు గాదిలిచుట్టల్॥
౨౧౦॥ చ॥ అని మొఱవెట్టఁ జొచ్చిరట యాపయి నౌదలయాచి యాతఁడు౯। గని
కరముప్పతిల్లఁ గడకంటను గన్గొని వారిఁ గూల్పఁగా। వినుఁడిదెయున్నరూపు వినిపించెద
నూపను నేను వెన్నునిం। గనుఁడతఁడయ్యెనేని మిముఁగావఁగఁ జాలినవాఁడు పోఁడిమి౯॥
౨౧౧॥ గీ॥ అనుచు నానతియిడెనఁట యాపలుకులు । చెవిని వేసుక చనిపైడిచేలవానిఁ।
గానఁగాఁ బోయి మ్రొక్కులు వేనవేలు। సలిపి విన్నవించిరఁటప్పై చంపమునసె॥ ౨౧౨
మత్తకోకిల॥ అంతటంగటి వేల్పువారలయందుఁ బ్రేమ మిూఱఁగా । నెంతకైనను నేను
గల్గఁగ నేల నెవ్వగ మాకిఁక౯। బ్రంతు రక్కసి కొండ్లముప్పుర దొడ్డతూపుల బ్రేల్మిడి౯
వంతలేలను బొందు గీములవంకనందఱు నెమ్మితో౯॥ ౨౧౩॥ క॥ అని వీడుకొల్పి
వెల్వడి। కనుసైగలు చేసి కాంచుఁ గైదండలతోఁ । జెనుసందడి సేయుచు వేఁ। జనిరఁట
మొదలందు సంతసంబలరారక౯॥ ౨౧౪॥ ఉ॥ వేల్పుల పాలివాఁడు కటివేల్పు తఁడిచ్చిన
బాసతప్పనే। తెల్పెద నెట్టులైన ననిఁదీఱుచు వారల పూన్కి యెల్లఁ దా। ల్వేల్పుల మంచు
నెవ్వరిని విక్కుచు లెక్క యొనర్పక క్కటా। సల్పితి మట్టివాని కెకసక్కెము క్రొవ్విన
నఁ జేటుమూడదే॥ ౨౧౫॥ క॥ తనబలిమి యెదిరిబలిమియుఁ । గనుఁగొనఁగా లేక
త్రుళ్ళి కావరమున నొ।ప్పనివేరము పూనితిమిటు । మనపొగరులె యింతచేసె మఱి
యేమిటికి౯॥ ౨౧౬॥

[సశేషము.]